# ప్రాచీనాంధ్ర నగరములు

(మొదటి భాగము)

రచయిత:

ఆదిరాజు—వీరభద్రరావు

కార్యదర్శి, శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి,

ప్రధాన తెలుగు పండితుడు, చాదరుఘాటు హైస్కూలు

ప్రధానాంధ్ర పండితుడు బాలికల ఉన్నత పాఠశాల

హైదరాబాదు—ద.

ఉపోద్ఘాత రచయిత

డాక్టరు పి. శ్రీనివాసాచార్యులుగారు, ఎం.ఏ.,పి.ఎచ్.డి. (లండన్)

ఆర్షశాఖాధ్యక్షులు—హైదరాబాదు రాష్ట్రము.

హైద్రాబాదు—ద.

౧౯౫౧

దేవాలయము కట్టించెను. ఈ విధముగా భోనగిరి జన్మకథ తెలియుచున్నది.

ఈ ప్రాంతము నేలుచుండిన హిందూరాజు ఆంధ్రుడే అయియుండును. గొల్లవాడాంధ్రుడు, శిల్పులాంధ్రులు. ఈవిధముగా నాంధ్రుల ప్రతిభా విశేషమున భోనగిరి దుర్గరాజము నిర్మితమయినది.

పూర్వశాసనాలను పరికించినచో తమకు పుణ్యాంగాను తమ పేర దేవాలయాలు నిర్మించుట సాంప్రదాయముగా నున్నట్లు తేలుచున్నది. ఆ సాంప్రదాయము ననుసరించియే భోనభోయుడట్లు కోరియుండును. అట్లు కట్టిన దేవాలయము నకు "భోనేశ్వరాలయము" అని పేరుపెట్టి యుందురు. ఆ దేవాలయ మిప్పుడు నామరూపములు లేకుండపోయినది, కాని అచ్చటనున్న నల్లరాతి సుందర నందివిగ్రహము ఆ దేవాలయపు ఉనికిని తెలుపుచున్నది.

భోనగిరి కోటను సుమారేడువందల సంవత్సరముల క్రిందట మహమ్మదీయులు జయించినట్లుగా తోచుచున్నది. పర్వతాగ్రమున పెక్కు భవనములు కలవు. అవియన్నియు హిందూత్వమును గోల్పోయియున్నవి. అచ్చటచ్చట కనబడు రాతి విగ్రహపు తుండెములనుబట్టి, అచ్చట దేవమందిరము లుండెనని యూహించవలసిన దేకాని, వేరెట్టి యాధారము లును కనబడవు అచ్చట నొక బావియున్నది. అది యెంత

లోతు గలదియో తెలియదు. నూర్లకొలది గజముల పొడుగుగల త్రాడువేసి చూచిరి. కాని అంతు తేలలేదట. ఒక కోనేరు కలదు. తూర్పుదిక్కున ౨,3 గుహలు కలవు. ఈ గుహాముఖములను సమీపించుటయే కష్టము. ఈ గుహలలో కనని, వినని ఓషధీ విశేషములు కలవని చెప్పుదురు. ఈ గుట్టపయి పరశువేది శిల యున్నదట! అది యెవరికి కనబడదు. పూర్వకాలములో గొల్లలు తమ మేకల గిట్టలకు ఇనుపనాడాలు కొట్టుచుండిరనియు, అవి బంగారుగా మారుచుండెననియు తెలియుచున్నది. ఆ గుట్టపయి చిఱుతపులులు, కోతులు, సివంగులు కొండచిలువలు మొదలగునవి కలవు.

ఈ భోనగిరి దుర్గ సంబంధమున సర్వాయి పాపడను ఆంధ్రవీరునికథ చారిత్రకముగా ప్రఖ్యాతి చెందియున్నది. ఇతడు "గౌండ్లకులజుడు. తాటికొండగ్రామవాసి చిన్నతనమున ఆవులగాయుచు, కల్లుగీయుచు జీవించుచుండెను. వీడు క్రమక్రమముగా ఉన్నతాశయములు గలవాడయి కొంతమంది యనుచరులను ప్రోగుచేసికొని వారి దోపిడులతో ద్రవ్యార్జన చేయసాగెను. వీని పేరు విని ప్రజలు గడగడ వణకుచుండిరి. తరువాత సేనలను కూర్చుకొని, యుద్ధసామగ్రులనమర్చుకొని రాజ్యముల పయి దండయాత్రలు సాగించెను. షాహపురమున గొప్ప కోట కట్టి తన నివాస స్థానముగా చేసికొనెను. వీని పరాక్రమాతిశయములు ఢిల్లీ చక్రవర్తి యగు బహద్దరుషాకు తెలిసి వీనిని శిక్షించుటకు ఆజ్ఞలు

సారించెను. గోలకొండ కుతుబుషాహీలను జయించి ఏడుగడియలు గోలకొండ రాజ్యమును ఏలినాడట! ఓరుగల్లు కోటపయి దాడి సలిపి దోచుకొన్నాడట! ఈభోనగిరి కోటను కూడ నిర్జించి పట్టణమును, పేటలను కొల్లగొట్టినాడట! రెండు మూడు వేలమంది స్త్రీ పురుషులను ఖైదీలుగా గొంపోయినాడట! ఇతనియొద్ద కాల్బలము, గుఱ్ఱపు దళము వేలకొలదిగ నుండెను. మహమ్మదీయులు ఈవీరుని ధాటికాగజాలక పెక్కు యుద్ధములు సలిపి, వానిని తరిమి పట్టుకొని తల నరికి వేసినారు. ఈ ఆంధ్రవీరుడు క్రీ. శ. ౧౭౦౮ లో కథావశేషుడయినట్లు లున్నది. ఈవీరుని గాథను తందాన పాటగా ఇప్పటికిని పాడుచున్నారు.

భోనగిరిని గూర్చిన చారిత్రక పరిశోధన మింకను చేయ వలసియున్నది.

౧౦.

# రాచకొండ కథనము:

తృణకాష్ఠ జలసమృద్ధి గలచోట గ్రామములు కట్టవలయునని చెప్పెదరు. ఇక రాజధాని పట్టణములు కట్టు విషయములో తృణకాష్ఠజలసమృద్ధి విషయములేగాక మరి కొన్నిసదుపాయములు కూడ చూడవలసియుండును ముఖ్యముగా శత్రు దుర్భేద్యమయిన కోటలు కట్టుటకు అనువయిన ప్రదేశముగా నుండవలెను. రాజకీయ, సాంఘిక, వాణిజ్య, సాంగ్రామిక దృష్టులతో పరిశీలించి, ఆంధ్ర రాజధానులు నిర్మితములయి యుండుట గమనించినచో, నాంధ్రరాజుల వివేచనాశక్తి యెంత గొప్పదో స్పష్టము కాగలదు. ఇట్లు కట్టబడిన రాజధానులలో "రాచకొండ" ఒక్కటియయి యున్నది:

రాచకొండ నల్లగొండజిల్లా నారాయణపుర సంస్థానములో నున్నది. నారాయణపురమున కేడుమైళ్ళ దూరమునను, హైదరాబాదునకు సుమారు 33 మైళ్ళ దూరమునను ఉన్నది.

తూర్పునుండి పడమర దిశకు ఎడతెగకుండ పోయెడు పర్వత శ్రేణియందు రెండు పర్వతములుగా భాగింపబడిన

పేటవాలు ప్రదేశమునందు ఈ దుర్గ నిర్మాణము జరిగి యుండుట మనము ముందుగా గమనింపవలయును. కొండల మధ్య గొప్ప తటాక మేర్పడుటయు, సదా శీతల మధురజల పూరితములయిన కొండవాగులు ప్రవహించుచుండుటయు, జలసమృద్ధిని సూచించు చున్నవి. పర్వత ప్రదేశములు, వాటి చుట్టును బలిసియున్న యరణ్య ప్రాంతము తృణకాష్ఠ సమృద్ధిని సూచించుచున్నది. సాంగ్రామిక దృష్టిలో నీపర్వతాలు పెట్టని కోటలుకదా!

ఉత్తరమునసున్న కొండను గుఱ్ఱములకోనేరుకొండ యందురు. ఇచ్చట గొప్ప కోనేరు కలదు. ఈకోనేటిలో గుఱ్ఱములు, ఏనుగలు మొదలగునవి నీరు త్రాగుచుండెను. కావున అట్టినామకరణము చేయబడినది. దీనినిబట్టి ఆయుత్తరపు కొండ సేనా నివాస కేంద్రముగా నుండియుండును. దీనికే "నాగానాయని కొండ" యనియు మరియొక పేరుగలదు. ఈ నాగానాయుడు ముఖ్య సేనాధిపతియై యుండి యుండును.

దక్షిణమున నున్న కొండకు "కచేరికొండ" యని పేరు. ఇచ్చట కచేరీలన్నియు నుండి రాజ్య పరిపాలనా కార్యములు జరుగుచుండెను కాబోలు. దీనికి రాచకొండ యనియు నామాంతరము కలదు. ఇది రాచవారి నివాస భవనముల కాకరమయిన కొండగా నుండియుండును. రాచకొండ అను పదమునే సంస్కృతములో "రాజాద్రి" అని శాసనము లందు పేర్కొని యున్నారు.

ఈ పర్వతములు అచ్చటి లోయకంటె అయిదారు వందల అడుగుల ఎత్తున నున్నవి. వీటికి సోపానము లున్నట్లు కొన్ని శిథిల చిహ్నములనుబట్టి యూహించవలయును.

ఈ నగరము ౫–౬ మైళ్ళవరకు వ్యాపించి యున్నట్లు అచ్చటచ్చట కనబడు గృహశేషములు, మండపములు, విశాలమయిన మార్గములు, దేవాలయములు, బావులు, కోనేరులు, తోరణములు, స్ఫురింపజేయుచున్నవి. పట్టణ ప్రవేశమునకు ౫–౬ సింహద్వారములు కలవు. ఇప్పుడు శిథిలావస్థలోనున్న సింహద్వారములను పరీక్షించినయెడల మనపూర్వికుల వాస్తుశాస్త్ర పరిజ్ఞానము, శిల్పకళా కుశలత్వము వెల్లడి కాగలదు. సింహద్వారపు గోడలు చక్కగా మలిచిన పెద్ద పెద్ద బండలతో నిర్మింపబడినవి. ఒక్కొక్క బండ ౧౫ అడుగులపొడవు, ౧ అడుగు ౧౦ అంగుళముల వెడల్పు, ౧ అడుగు ౫ అంగుళముల మందము కలిగి ఒక దానిపై మరొక్కటి అందముగా పేర్చబడినవి, ఈ రాళ్ళను ఎట్లు పేర్చగలిగిరో కదా! ఇంకొక విశేషమేమన ఈ రాళ్ళను అతుకుటకు సున్నముగాని, మట్టిగాని వాడబడలేదు. దేవాలయములు కూడ ఇట్లే నిర్మితములయినవి. శిలాఫలకములు అతుకుకొనిపోయి సందులేకుండ నుండును. ప్రధాన దుర్గము యొక్క ఉత్తర, దక్షిణ, పశ్చిమద్వారములను కలుపుచు ఒక ప్రాకారకుడ్యముండెను. ఇది ౧౩౫౪ అడుగుల పొడవు కలది. నేల మట్టమునుండి ౧౮ అడుగుల ఎత్తు కలది. ఈ ప్రాకారకుడ్యమునకు అయిదు బురుజు లుండెను.

కచేరీ కొండను ప్రవేశించుటకు నెన్నో వక్రమార్గము లను నడువవలెను, నాలుగు ద్వారములను దాటవలెను. ఈ ద్వారములు మిక్కుల భయావహములుగ గండ శిలల కప్పు గలిగియున్నవి. ఒకచోట రెండు వాకిళ్ళు ఒకదాని వెంట మరియొకటి కట్టబడినవి. వీనికి జంట వాకిళ్ళని పేరు. నాల్గవ ద్వారమును గడచితి మేని ఒక చతురశ్రమ ప్రదేశమున నాల్గువైపుల నాల్గు మంటపములు కలవు. ఇదియే కచేరి యని పిలువబడు ప్రదేశము. ఇచ్చటి రాతితిన్నెలు, అంగణము వ్యవహారజ్ఞులతో కిటకిట లాడుచుండియుండును. కచేరి శిలా కుడ్యములను దాటి తూర్పుగా పోయినచో ఒకకొండ బీట కనబడును. ఇది రమారమి ౩౫ అడుగుల పొడవును, ౨ అడుగుల వెడల్పును గలిగి యున్నది. దీని లోతు ఎంతో ఎవ్వరికిని దెలియదు. ఇది సార్వకాలము జలపూర్ణమయి యుండును. చల్లనినీరు. మధురోదకము, ఒడ్డున కూర్చుండి వంగకుండ చెంబు ముంచి నీరు తీసికొనవచ్చును. దీనికి సంకెళ్ళ బావియని పేరు. ఇదియొక ప్రకృతి చిత్రము.

నాగనాయుని కొండపయి వల్లు మొదలగునవి దంచు టకును, నూరుకొనుటకును అనువగు రోళ్ళు కనబడుచున్నవి. ఈ కొండమీదనే ప్రవేశింపరాని స్థలమొకటి కలదనియు, అచ్చట రెండు గండశిలలమధ్య నొక బిలమున్నదనియు, ఆ బిలములోనికి బాగుగా దృష్టి సారించినచో శిలా విగ్రహ ములు గానుపించుననియు జనులు చెప్పెదరు ఇందేదో

రహస్యముండి యుండును. కాని ఆ ప్రదేశ మెచ్చటనున్నదో ఎవరికిని తెలియదు.

ఈ రాచకొండలో అన్ని మత సాంప్రదాయముల వారును ఉన్నట్లు తోచుచున్నది. శివమందిరములు, వీరభద్రాలయము, శ్రీరామచంద్రస్వామివారి కోవెల, మున్నగునవి ౩౦ వరకు దేవాలయములుండెను. ఒక్క శ్రీరామచంద్రస్వామివారియాలయము మాత్రము ఇప్పటికిని మంచిస్థితిలో నుండి, మడిమాన్యములు కలిగి పూజాదుల భాగ్యము కలిగియున్నది. కడమ వన్నియు నాశనమయినవి. అచ్చటచ్చట గండశిలలపయి భైరవ విగ్రహములు, గరుడ విగ్రహములు, ఆంజనేయ విగ్రహములు, చక్కగా చెక్కబడి యున్నవి. ఒక గండశిలపయి దిగంబర విగ్రహము చెక్కబడియుండుటచే, అచ్చట జైనులుకూడ నుండియుందురు. ఇప్పుడు ౩-౪ మసీదులు కనబడుచున్నవి. ఇందొక్కటి మాత్రము మంచి స్థితిలో నున్నది. ఇందలి యొకరాతిమీద ౮౪౯ హిజ్రి తారీఖుగల అరబ్బీ లిఖితముకలదు. సుమారు ౫౦౦ సంవత్సరముల క్రిందటిదన్నమాట. హిందూదేవాలయమునే మసీదుగా మార్చినట్లు తోచుచున్నది. ఈ దుర్గము మహమ్మదీయుల వశమయి తరువాత ఈ మసీదులు ఏర్పడియుండవచ్చును. ఇచ్చట ఆంధ్రరాజులు వేయించిన శిలాశాసనములును కలవు

ఈ దుర్గము ఎప్పుడు నిర్మితమయినదో సరిగా తెలియదు. పదునాల్గవ శతాబ్దమున అనపోతనాయని స్వాధీన

ములో నున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. ఈ అనపోత నాయుడు రేచెర్ల సింగమనాయుని కుమారుడు. రేచెర్ల సింగమ నాయుడు ప్రతాపరుద్ర చక్రవర్తి సేనానాయకులలో నొక్కడై యుండెను ఈ సింగమనాయని కుమారులకు అనపోతనాయుడు, దామానాయుడు, మహావీరులయి యుండిరి. అనపోతనాయుడు భైరవ వంశమునకు చెందినవాడనియు, మహామండలేశ్వర, ఆంధ్రదేశాధీశ్వర, కాకతీయ స్థాపనాచార్య, అష్టదిగ్రాజ భయంకర మొదలగు బిరుదులు కలవాడయి నట్లును శాసనములు తెలుపుచున్నవి. అనపోతనాయుని శాసనములు క్రీస్తుశకము ౧౩౮౧ వరకు కనబడుచున్నవి, ౧౫వ శతాబ్దాంతమున రాచకొండదుర్గము మహమ్మదీయుల వశమయి యుండునా? పదునైదవ శతాబ్దాంతముననో, పదునారవ శతాబ్ద ప్రారంభముననో దీనిని ఓరుగల్లు నేలుచుండిన షితాబుఖాను బిరుదాంకితుడగు సీతాపతి జయించి యుండెను. చిత్తాపఖాను ప్రభువు ప్రత్యర్థి వంశాటవిని దహించి రాజాద్రి ప్రముఖాని దుర్గమశిలా దుర్గాణి భగ్నా శ్రీయుడయిసాధించినాడని ఓరుగల్లు షితాబుఖాను శాసనము తెల్పుచున్నది.

రాచకొండ దుర్గమునకు ౨-౩ మైళ్ళదూరమున అరణ్యములో స్తనములు చెక్కివేయబడిన స్త్రీ రూప శిలా విగ్రహము కలదు. ఈ విగ్రహమునుగూర్చి యొక కథ చెప్పెదరు. చెట్టు చెడుకాలమునకు కుక్కమూతిపిందె పుట్టు నను సామెతగా రేచెర్ల రాజవంశములో నొక ప్రబుద్ధుడు

పుట్టెను. ఈ రాజు రకరకాల పరిమాణములుగల గిన్నెలను చేయించి వానిని ప్రతి స్త్రీ యొద్దకు పంపెడివాడట! ఆమె స్తనము ఏగిన్నెకు సరిపడునో ఆగిన్నెడు మాడలు రాజు గారికి కప్పముగా ఆమె యీయవలసి యుండెనట! ఈ కొలత కార్యము రాజభటులే చేయుచుండిరట! ఈ దారుణపద్ధతి దుర్భరముగా నుండెను. రాజభటులు తనను సమీపించగనే ఒక మానవతి క్రోధావేశమున తన స్తనములను కోసివేసి, రాజును, రాజ్యమును, శపించుచు, దేహత్యాగము చేసెనట! ఆ సాధ్వీశాప మూలముననే రాజ్యము నాశన మయినదట! ఏమో! పాపమూరక పోవునా?

రాచకొండ గొప్ప విద్యారంగముగా నుండెను. కవులు, పండితులు, గాయకులు ఈ రాజాస్థానమున సన్మానములు పొందుచుండిరి. సింహాసన ద్వాత్రింశిక అను గొప్ప ఆంధ్ర ప్రబంధమును వ్రాసిన కొఱవి గోపరాజు కవి యీ యాస్థానము నందుండెను. ఈ గోపరాజు పెదతండ్రులు రామరాజు, కేసన, బాచిరాజు అనువారలు రాచకొండలో మంత్రులుగా నుండిరి. అల్లసాని పెద్దనకు పూర్వమే "ఆంధ్ర కవితాపితామహ" బిరుదాంకితుడయిన కొఱవి సత్తెనారన రాచకొండ రాజ్యాధిపతుల ఆశ్రయములో వర్థిలుచుండెను. ఈతడు గోపరాజు పినతాత. మొదటి ఆంధ్ర కవితా పితామహుని యునికికి తావలమయినట్టిది తెలంగాణము సుమా! తెలంగాణ వాసులు గర్వింపదగిన విషయము.

రాచకొండ రాజులలో సర్వజ్ఞ సింగభూపాలుడు సంగీత సాహిత్య కళావిశారదుడు. మంచి రసికుడు. గ్రంథ కర్త. శ్రీనాథ మహాకవి ఈ రాజన్యుని రాచకొండలో దర్శించి యుండెను. అప్పుడు

"ఎట్లు మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు కవివిశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సకల సద్గుణ నికురుంబ శారదాంబ."

అని శ్రీనాథునంతటివాడు సరస్వతీదేవిని ప్రార్థించ వలసి వచ్చిన ఐతిహ్యము కలదు. ఈ సింగభూపాలునకే బమ్మెర పోతరాజు మహాకవి భోగినీదండకము వ్రాసియిచ్చె ననియు, ఆంధ్రభాగవతము నంకితము చేయుటకు నిరాకరించె ననియు కథలు కలవు.

ఆ మహానగరము నశించినది. ఆ విద్యాగోష్ఠుల కలకలము, ఆ సంగీత కోలాహలములు, ఆ హయహేషలు, ఆ గజబృంహితములు, ఆహారవనినాదములు కాలగర్భమున నణగి పోయినవి. అయినను, ఆ రాజన్యుల నిపుణాశక్తులను, పౌరుష ప్రతాపములను, దైవభక్తి తాత్పర్యములను చాటుచు ఆ దుర్గశిఖరములు ఇంకను నిలిచియున్నవి.

—:•:—

౧౧.

# వరంగల్లు కథనము:

వరంగల్లు అని యిప్పుడు వ్యవహారములో నున్న నామమునకు "ఓరుంగల్లు, ఓరుగల్లు" అనునవి పూర్వకాలములో నున్న మొదటి రూపములు. ఓరుంగల్లు శబ్దభవమే వరంగల్లు. ఓరుగల్లును ఏకశిలానగరము, ఏకశిలా పురి, ఏకోపల అని సంస్కృతీకరణము చేసి కావ్యములందును, శాసనములందును వాడియున్నారు. కాకతీయాంధ్ర సామ్రాజ్యమునకు రాజధాని యగుటచే "ఆంధ్రనగర" మనియు ప్రసిద్ధనామము వచ్చినది.

వరంగల్లు నగరము హైదరాబాదు–బెజవాడ రయిలు మార్గమున, హైదరాబాదుకు ఈశాన్యముగా ౮౬ మైళ్ళ దూరముననున్నది. ఈ నగరమునకు పూర్వమున్నంత ఘనత లేక పోయినను ఇప్పుడును రాజకీయముగ ప్రాధాన్యముగల పట్టణముగానే యున్నది. హనుమకొండ, మటెవాడ, వరంగల్ కోట, ఉర్సు, కరీమాబాదులు కలిసి వరంగల్ పట్టణముగా ఇప్పుడు వ్యవహరింపబడు చున్నది. నిజాం రాష్ట్రములో

హైదరాబాదు నగరము తరువాత పేర్కొనదగినది వరంగల్లు పట్టణమే. ఓరుగల్లుపట్టణ నిర్మాణమునుగూర్చి ఈక్రిందివిధముగా పూర్వ గాథ కలదు:—

క్రీస్తుశకారంభమునుండి అనుమకొండ [హనుమకొండ] ఆంధ్రుల రాజధానిగా నుండినట్లు తెలియుచున్నది. శ్రీశైల ప్రాంతారణ్యప్రదేశములనుండి ఎఱుకు దేవరాజు అను శూరుడు వచ్చి హనుమాద్రి నాక్రమించి రాజ్యము చేయ సాగెను. ఆతని కుమారులగు అనుమడు, కొండడు అనువారి పేరున అనుమకొండ నిర్మితమయినది.

చాళుక్య రాజొకడు నందగిరి [నాందేడు]లో పాలించు చుండెను. ఆతని మరణానంతరము అతని యిద్దరు కొడుకులు రాజ్యమును బంచుకొని యొకడు అనుమకొండ యందును, మరియొకడు కందారమునందును రాజ్యముల నేలుచుండిరి. బల్లహుడు అను [కల్యాణి] కటకపురాధీశ్వరుడు కందారము రాజ్య పాలకుడయిన సోమదేవుని యుద్ధమునందు చంపినందున గర్భిణియగు నాతని విధవభార్య సిరియాలదేవి హనుమకొండకు పరుగెత్తి మాధవశర్మయను బ్రాహ్మణోత్తముని రక్షణములో నుండి బల్లహుని ముప్పు తప్పించుకొనెను. అచ్చట నారాణి యొక పుత్రునిం గనియెను. అతని పేరు మాధవవర్మ [క్రీ.శ. ౩౧౮]. ఇతడే కాకతీయ వంశములో మొదటివాడయినట్లును ఈవంశమువారు పద్మాక్షీ దేవి వరప్రసాదమున ౧౦౦౦ సంవత్సరములు రాజ్యము చేసినట్లును చెప్పబడు చున్నది.

కాకతీయ రాజవంశములో పదియవ వాడగు ప్రోల రాజు రాజ్యము చేయుచుండగా [౧౧౧౬--౧౧౫౭] అనుమకొండకు ధాన్యము తెచ్చుబండ్లు ఒక రాత్రివేళ తలక్రిందు లయినవట! మరునాడు బండ్లను లేవనెత్తుటకు కూలివాండ్రు వెళ్ళగా బండ్లచక్రముల యినుప పట్టాలు బంగారు మయము యయుండెనట. ఈ సమాచారము రాజుగారు విని స్వయముగా పరికించి యాశ్చర్యపడి పండితుల యాలోచన ప్రకారము ఆ ప్రదేశమును త్రవ్వించెనట. అప్పుడచ్చట నొక జ్యోతిర్లింగము కనబడెను. ఆ లింగమును హనుమకొండకు తీసికొని రాదలంచెను. కాని దానిని కదలింపలేకపోయిరి. అందుచే నచ్చటనే యా లింగమునకు ఆలయము కట్టించి ఓరుగల్లు అను ఏకశిలా నగరమును కట్టించెను. ఈ వరంగల్లు కరీమాబాదు ఉర్సులకు మయిలు దూరమున తూర్పుదిక్కుగాను, మటెవాడకు మయిలు దూరమున ఆగ్నేయ దిక్కునను, హనుమకొండకు నాలుగు మయిళ్ళ దూరమున ఆగ్నేయ దిక్కుగను నెలకొనియున్నది. మటెవాడ రామన్నపేట, గిర్మాజిపేట, బాలానగరు, గోవిందునగరు అను అయిదు గ్రామాలకూటమి. ఓరుగంటిలో నగరవువాడ, బ్రాహ్మణ వాడ, ఉప్పసిరవాడ, పానుగంటివాడ ఉన్నట్లు తెలియుచున్నది.

వరంగల్లు సముద్రపు మట్టమునకు ౧౦౫౦ అడుగుల ఎత్తుననుండి కృష్ణాగోదావరీ నదుల మధ్యస్థమగు పల్లపుమాగాణమునందున్నది. ప్రచండ ప్రస్తరములతో నిండిన పర్వత భూమి యగుటచే శత్రువులకభేద్యమయి సాంగ్రామికదృష్టిలో

ఎక్కువ యనుకూల ప్రదేశముగా నుండెను. అందుచే మొదటి ప్రతాపరుద్రుడు [౧౧౫౮—౧౧౯౫] తన శత్రువుల దాడినుండి యెట్టి ముప్పును రాకుండ నుండుటకయి ఓరుగల్లునకు రాతిప్రాకారములను కట్టించ ప్రారంభించి తన రాజధానిని అనుమకొండనుండి ఓరుగల్లునకు మార్చెను. తరువాత గణపతి దేవ చక్రవర్తి [౧౧౯౯—౧౨౬౦] రుద్రమ దేవి [౧౨౬౦—౧౨౯౬] ఈ కోటను బలపరచినట్లు తెలియుచున్నది. ఇట్లు ఓరుగల్లు రాజధాని గౌరవమును పొందుటచే క్రిమక్రమాభివృద్ధి చెంది జనసమానమయి విరాజిల్లెను.

ఓరుగల్లుకోట ఆ కాలములో అభేద్యమయి, సాటిలేనిదయి యుండెను. ఈపురమునకు ఏడు కోటలుండెననియు, కంచుకోట, ఇటుకకోట, రాతికోట, పుట్టకోట, భూమికోట, కంపకోట, గవిసికోట యనునవి వాటి పేర్లనియు కలదు. కాని భూమికోట, రాతికోట అను రెండు మాత్రమే ఇప్పుడు తెలియవచ్చునవి. లోపలి ప్రాకారము రాతికోట, బహిః ప్రాకారము భూమికోట మట్టితో కట్టబడిన యీ కోటకుడ్యములకు ఫిరంగి గుండు తగిలినను ముక్కవోని పటిమ యుండెను. పుట్టకోట హనుమకొండకు దక్షిణమున నారుమైళ్ళ మీద మిగుల జీర్ణావస్థయందు గాన్పించును. రాతికోట వలయము సుమారు ఎనిమిది మయిళ్ళు. దీనికి నాలుగు సింహద్వారములుండెను. ఇవి నాలుగు దిక్కులను గట్టబడెను. తూర్పు, పశ్చిమము లందలి ద్వారములు మాత్రము తెరచి యున్నవి. ఉత్తర దక్షిణద్వారములు మూసి

యున్నవి. ప్రతి ద్వారమునందును మూడు త్రోవలు కలవు. సింహద్వార మను పదము సార్థకముగా నుండుటకయి రాతిసింహ ముండును. ఈ ద్వారముయొక్క ఇరుప్రక్కల లోపలి భాగమునందు ౨౦ గజములవరకు శిలలతో నిర్మితమయిన సోపాన పంక్తి గలదు. రాతి ప్రాకారమువెంబడి ఎడ ఎడముగా డెబ్బదిరెండు బురుజులు నిర్మితమయినవి. వీటి పై భాగము విశాలముగా నుండును. లోపల మెట్లుండును. ఈ రాతికోట కుపయోగించిన శిలలు పెద్దపెద్దబండలు. వాటిని చక్కగా నునుపుచేసి ఒకదానిపై నింకొకటి పేర్చినారు. రాళ్ళ నతికించుటకు సున్నము వాడలేదు. కోట చుట్టును అగాధమగు అగడ్త కలదు. ద్వారములయందును, కొన్ని స్తంభములమీద శాసన లిఖితములు గలవు. ఈస్తంభాలలో రెండు నల్లరాతి మయములు. ముప్పదిఅయిదు అడుగుల ఎత్తుగలవి. ఇవి కోటలోని అంతర్భాగమున ‘కాం “నిగూష’ అను ప్రాంతమందున్నవి. అయిదు నుండి ఎనిమిది అడుగుల ఎత్తుగల మరికొన్ని స్తంభాలు కలవు. వీటిలో నొకటి మతెవాడలోని కటికవాని దొడ్డిలోను, మరియొకటి మతెవాడ వరంగల్లు మధ్యనున్న తాళ్లవనములోని బావియొద్దను, రెండోమూడో వరంగల్లులో దక్షిణకీర్తిస్తంభమునొద్దను పడియున్నవట! ఇట్లు శిలాస్తంభములు పాతుటయు, వాటిపై శాసనములు లిఖించుటయు బౌద్ధ సంప్రదాయము. జైనులు, హిందువులును నదే సాంప్రదాయము నవలంబించిరి. వరంగల్లు మధ్యభాగమందలి కీర్తిస్తంభములు నాలుగుదారుకల్పితములుగా నుండును. వరంగల్లులోని నాలుగు ద్వారములు

ప్రతాపరుద్రుని కాలమునాటి శాసనములని చెప్పబడు చున్నవి. ఓరుగల్లు కోటకు నాల్గు ద్వారములు [illegible]. [illegible] కలదు [illegible] శిల్పముగల [illegible] గలవు. [illegible] దృష్టి [illegible] గావించు [illegible] ప్రదేశమునందలి శిథిల భవనముల [illegible] తెలియుచున్నది. ఉత్తర ద్వారమునందలి శిథిల మందిరము మందుగుండు సామానులను భద్రపరచు స్థలముగా తెలియుచున్నది.

ఓరుగల్లు పట్టణము వైభవదశలో నున్నప్పుడు అత్యంత రమణీయముగా నుండెను. పెక్కు సౌధములు, పెక్కు దేవాలయములు ఉండెను. భైరవాలయము, చాముండేశ్వరి మహాశక్తి నగరు, వీరభద్రేశ్వరాగారము, ఖడ్గదేవు విహారము, మాసానమ్మగుడి, కుమారస్వామియాలయము, పాండవులగుడి, కేశవస్వామి ఆలయము, స్వయంభూదేవుని నికేతనము మొదలగునవి ప్రతాపరుద్రుని కాలములో ప్రసిద్ధి చెందినవిగా నుండెను. భైరవుని తోడి జోడుగ మైలారు దేవుడు విలసిల్లి యుండెను. మైలారు దేవుని యుత్సవములు మహావైభవముతో జరుగుచుండెను. జమదగ్ని మహాముని భార్యయు, పరశురాముని తల్లియునైన రేణుకాదేవి ఓరుగల్లులో ఏకవీరా మహాదేవి యను పేరితో నాదిశక్తి యవతారముగా పూజల

నందు చుండెను. ఉత్సవదినములలో ఏకవీరా మహాదేవి యెదుట బవినీలు పరశురాముని కథలు పాడుచుండిరి. వీర పురుషారాధనముగూడ ఆకాలములో ఎక్కువగా నుండెను. పల్నాటివీరుల యాలయము ఏకశిలానగరమున ప్రసిద్ధమైనదిగా నుండెను. ఒకానొక స్త్రీ తాళవాయిద్యముల సహాయమున ద్విపద ప్రబంధమున వీరుల చరిత్రలు పాడునప్పుడు సభాసదులు తన్మయులయి ఆ యా రసముల కనుగుణముగా అభినయించు చుండెడివారట! వీర పురుషుల విగ్రహము లిట్లుండెను;—

"పచ్చని పిండిగందమును బాలము సేసయు నెత్తుపూవులం
గుచ్చిన కంఠమాల్యములు గుప్పగఁ గల్గిన వేణిబంధముల్
కుచ్చులవీరసంబెటయు గ్రొత్తమణుంగగు కాసెపుట్టమున్
బచ్చలు చెక్కినట్టి రవణంబులు వీరకుమారకోటికిన్"

(క్రీడాభిరామము.)

ఘటికా యంత్రముకూడ ఒకటి యుండెను. ఇది మన గడియారము వంటిది. అయితే వారు గడియల ప్రకారము గంట కొట్టుచుండిరి. పూటకూళ్ళ యిండ్లుకూడ నుండెను. అయిదు వందల పూటకూళ్ళ యిండ్లుండెనని ఏకాంబ్రనాథుడు రచించిన "ప్రతాపరుద్ర చరిత్రము" తెలుపుచున్నది. లక్ష్మణయొజ్జయొక్క పూటకూళ్ళయిల్లు ప్రసిద్ధికెక్కినదిగా నున్నట్లున్నది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు, వివిధ వృత్తులవారు, వేశ్యా గృహములు, వీర

భటులు, అశ్వములు, ఏనుగులు పురమునందంతటను క్రిక్కిరిసి యుండెను. కోటయందలి శిల్పచిత్రములు, నందులు, శంభుని గుడి, సింహద్వారములు, స్తంభములు, దేవాలయములు చూడదగినవి.

హనుమకొండ హనుమద్గిరి అను పర్వతముల మధ్యగలదు. హనుమద్గిరికి తూర్పున భద్రిగుడి, పశ్చిమమున పద్మాక్షి యాలయము, ఉత్తరమున నాగులదేవుని మందిరము, దక్షిణ మున గోపాలమూర్తి నిలయము. మధ్య సిద్ధేశ్వరాలయము గలవు. కొండపయిని కోటగోడల శిథిల చిహ్నములు తూర్పు పడమరలయందు కాన్పించును. కాని దక్షిణమున గాన్పించవు. కొండలకు వాయువ్య మూలన తెరపిగా నుండిన ప్రదేశమునకు రక్షణగా నొక ప్రచండమయిన మట్టి కట్టయు, దానికొక మూలయందు ద్వారమును గలవు. ఆ పర్వతమునకు కొంత దూరమున గొప్ప తటాకము గలదు. అలాగే ఆగ్నేయమూల యందలి తెరపి ప్రదేశమున మట్టి కట్టయు ద్వారమును గలవు. ఆ కొండల దాపునుండి మరె వాడ వరకు భద్రితటాకము గలదు. పై యంశములనుబట్టి హనుమకొండకు రక్షణగా నొక దుర్గము నిర్మాణము గావిం చుటకు ప్రారంభించినట్లు కనబడుచున్నది. ఓరుగల్లు పురమును రాజధానిగా వరించిన తరువాత హనుమకొండదుర్గ నిర్మాణ కార్యము సాగలేదు. ఓరుగల్లు దుర్గము కొరకు హనుమ కొండ దుర్గనిర్మాణమును అసంపూర్తిగ వదలి వేసిరి. ఓరు గల్లు వృద్ధిపొందినకొలది హనుమకొండ ప్రాధాన్యము . తగ్గుచు

వచ్చెను. సృష్టిక్రమము ననుసరించి ఓరుగల్లు నశించగా మరల హానుమకొండ యభివృద్ధి నొందుచున్నది.

హానుమకొండ యందలి దర్శనీయ ప్రదేశములలో సహస్రస్తంభ మంటప దేవాలయము శ్రేష్ఠమయినది. చాళుక్య శిల్పము ననుసరించి ౧౧౬౨ లో నిది నిర్మింపబడినది. కాని పూర్తి గావింపబడలేదు. ఇందు ఒకదానితో నొకటి సంబంధములేని మూడు విశాలాంగణములును, వానికి ముందు 300 స్తంభములచే నొప్పారెడు నొక ముఖమండపము గలదు. ముఖమండపమున కెదుట నక్షత్రాకారముగల మండపము గలదు. దీనికి ౨౦౦ స్తంభములు కలవు. ఆలయమునకు ఈ మండపమునకు మధ్య మనోహర రూపలావణ్యములు గల నంది శిలా విగ్రహము గలదు. త్రికూటాలయములోని స్తంభముల క్రమమును, అంతరముల వైవిధ్యమును ఆకార రేఖకు ననుగుణముగా నుండి యానందము గొల్పుచున్నవి. మండప స్తంభముల మీద నెట్టిపనితనము లేదు. కాని ఆలయ స్తంభముల మీద అతి అగపించకుండ, మనోహరముగా చిత్రములు చెక్కబడినవి. జంట స్తంభములపయి ఒకేవిధమయిన చిత్రములు చెక్కబడినవి. ద్వారబంధములు, గవాక్షముల శిలలు, స్తంభములకుగల బ్రాకెట్టులు మొదలగునవి చాల అందముగా నున్నవి. మూడు దేవాలయములను గూర్చియొక్కటిగా నేర్పరచిన క్రమము నిరలంకార విధముకంటె నెక్కువగా వివిధ ప్రయోజన సంధాయకమయి యున్నది. మరియు వెలుతురు, నీడ నిచ్చుటయందును ఎక్కువ సుఖావహముగా

నున్నది. ఆలయమునకు కుడిభాగమున సుమారు మూడడు గుల ఎత్తును, ౧౨—౧౫ అంగుళుల వెడల్పును గల వేదిక మంది: శోధన వృద్ధిచేయుచున్నది.

చిన్న దేవాలయములు ఇట్లే కట్టబడి నప్పటికిని ఈ త్రికూటాలయ పద్ధతి లేదు, ఈ దేవాలయములన్నియు శివాంకిత ములు. విష్ణ్వాలయములు అంతగా లేవు హనుమకొండ చుట్టు ప్రక్కలలో గండశిలలపయి వైష్ణవ విగ్రహములు చెక్కబడి యున్నవి. గుట్టమీద పద్మాక్షి దేవాలయ మున్నది. ఈ పద్మాక్షి దేవత కాకతీయ రాజుల కులదేవత.

విద్యారంగమునందును ఓరుగల్లు పురము కీర్తి వహించి యున్నది. నృత్తరత్నాకరము వ్రాసిన జాయపసేనాని, ప్రతాపరుద్ర యశోభూషణము వ్రాసిన విద్యానాథ మహాకవి ఓరుగల్లు కార్యక్షేత్రముగా గలిగి యున్నవారు. శ్రీమదాంధ్ర భాగవత కర్తయగు బమ్మెర పోతనామాత్యుడు శ్రీరామా జ్ఞానుసారము ఏకశిలా నగరముననే భాగవత రచన చేసినట్లు స్పష్టముగా తెలిపియుండుట అందరికి విదితమే. మార్కండేయ పురాణము వ్రాసిన మారన, నీతిసారము వ్రాసిన రుద్రదేవ చక్రవర్తి, పురుషార్థసారము రచించిన మహాప్రధాని శివదే వయ్య, మున్నగు కవులు, విద్వద్వర్యులు ఓరుగల్లుపురమును తమ పాదరజముచే పవిత్రము చేసిన మహనీయులు. శైవ వాఙ్మయమునకు జన్మస్థానము, ఆటపట్టు ఓరుగల్లని చెప్ప వచ్చును.

ఇట్లు అసామాన్యపురవరముగా పొగడొంది, శిల్ప సౌందర్యమునకు నిలయమయి, వాణిజ్యలక్ష్మీవిలాసమున కాకరమయి విద్యా వినోదాల కాటపట్టయి, అభివర్ణనీయ మయి, ఆకర్షణీయమై విరాజిల్లిన ఓరుగల్లుపట్టణము గజపతు లకు, అశ్వపతులకు కండ్లు కుట్టునట్లు చేసినది. తత్ఫలితముగా పాడుగోడలు మంటిదిబ్బలు మనకిప్పుడు దృగ్గోచర మగు చున్నవి. నిజాం సర్కారు వారిప్పుడు ఈ మంటిదిబ్బలను త్రవ్వించుచున్నారు. ఇంతవరకు భూగర్భమునందు డాగి యుండి యిప్పుడు బయటపడిన యీ పూర్వ వైభవ చిహ్న ములు, శిథిలమయిన శిల్పశకలములు, మనపూర్వుల వాస్తు శాస్త్ర పరిజ్ఞానమును కళాభిజ్ఞతను దైవభక్తిని చాటు చున్నవి. ఆంధ్రులమయిన మనము వీటిని దర్శించు పుణ్యముకట్టుకొని, అశ్రుతర్పణము గావించి తరించెదముగాక.

పద్మాక్షీ దేవి యనుగ్రహమున మాధవవర్మ తొట్టి ౧౫ మంది రాజులు వేయి సంవత్సరములు ఓరుగంటి నేలి రని ప్రతాపరుద్ర చరిత్రము నుడువుచున్నది. కాకతీయ చక్రవర్తులలో రుద్రదేవ చక్రవర్తి (౧౧౫౮–౧౧౯౬) గణపతిదేవ చక్రవర్తి (౧౧౯౮–౧౨౬౧) రుద్రమదేవి చక్రవర్తిని (౧౨౬౧–౧౨౯౫) వీరప్రతాపరుద్రదేవ చక్రి వర్తి (౧౨౯౫–౧౩౨౬) ఓరుగంటి రాజ్యలక్ష్మికి పండు వులు చేసిన మహానేతలు. కాకతీయ వంశములో వీరప్రతాప రుద్ర దేవ చక్రవర్తియే కడపటివాడు. ఈ మహాపురుషుడు విధివశమున అవతారము చాలించగా ఈతని రాజ్యము

ఛిన్నాభిన్నమయ్యెను. ప్రతాపరుద్రునకు జుట్టయను కొమరుడున్నట్లు తెలియుచున్నది. వీరభద్రుడు రాజ్యమునకు వచ్చినట్లును, అతడు తనస్థానమును కొండపల్లికి మార్చు కోవలసి వచ్చినట్లును ఒక వాదముగలదు. ప్రతాపరుద్రుని తరువాత రాజ్యమునకు వచ్చినది కృష్ణనాయకుడనియు, అప్పుడు వానిరాజ్యము చాల తగ్గియుండెననియు కొందరు చరిత్రకారులు వ్రాసియున్నారు. కావున కాకతీయ వంశము ప్రాముఖ్యమును గోల్పోవుటయో సామంతాధికారమును వహించుటయో సంభవించి క్రమక్రమముగ రంగమునుండి తొలగియుండ వచ్చును.

కాకతీయరాజుల కాలములో మాడలు, మాడువులు, బడిమాడవులు, చిరువీడ, గద్యాయనము, పగోడాలు, మాడబడి పాతిక, మున్నగు పేళ్ళుగలనాణెములు చలామణి అగుచున్నట్లుగనుపించుచున్నది. భూమికొలతలో పుట్టి,గాలుప్లు, గడపుట్లు, మరుతురు, గడమరుతురు, మట్లు, నివర్తనము, మున్నగు పదాలు వాడుచుండెడివారు. ధాన్యాదుల కొలత, తూనికల విషయములో గిద్ద, తులము, ఖండుగ, కోదె,మానము, మానిక, తూము, నిబరవము, పలము. వీసె, అడ్డ మున్నగునవి వాడుకలో నుండెను. ఓరుగంటికి, ఓరుగంటి రాజ్యమునకు వచ్చుచు పోవుచు నుండెడు స్వదేశి పరదేశి వస్తువులపయి వేర్వేరు విధములుగా పన్నులు విధించుచుండిరి. బండిబరువు సామానును బట్టి పన్ను గణించుచుండిరి. ఈ విధి పండ్లు, ధాన్యము, తైలాలు, నెయ్యి మున్నగు వాటి

కిని వర్తించుచుండెను. ఉప్పు పొట్టుగల ధాన్యము మొదలగు వాటికి "పెరుక" ను బట్టి నిర్ణయించుచుండిరి. పెరుకయనగా ఎద్దు మూపుపయి వేసెడు రెండు సంచుల బరువు. చందనము, లోహములు మొదలగు వాటికి తులామాన మోపయోగించుచుండిరి. ఇట్లే జవ్వాది, పునుగు, పత్తి, నూలు, బట్టలు మొదలగువాటిపయి వేర్వేరు మానములతో పన్నులు విధించుచుండిరి. ఓరుగంటిలో వృత్తిపన్ను గూడ అప్పుడుండెను. సంవత్సరమునకు వర్తకులు ఒక మాడయు, సాలెవాండ్రు ౧౬ చిన్నాలును, గొల్లలు ౧౪ చిన్నాలును వృత్తిపన్నుగా ఇచ్చుచుండెడివారు.

సాని శబ్దమునకు పూజ్యార్థ మిందుచుండెను. పోతనామాత్యుడు భాగవతములో తన మాతృశ్రీని గూర్చి ముచ్చటించుచు, ఆమెను "లక్కసాని" అని వర్ణించినాడు. ఈ వర్ణనాంశములను బట్టి ఓరుగల్లు పురము వర్తకమునకు కేంద్రమయి, అత్యుత్తమ రాచరిక లక్షణములు గలిగి నాగరికతా విశిష్టమయి మేటియయి విరాజిల్లినట్లు స్పష్టమగుచున్నది.

ఓరుగంటిని కబళించుటకు పరరాజులు చేసిన ప్రయత్నము ౧౩౦౩ లో ప్రారంభమయ్యెను. మహమ్మదీయులు ఉపక్రమించిరి. కాని వారి ప్రయత్నములను ప్రతాపరుద్రుడు సాగనియ్యలేదు. అందుచే ఢిల్లీ చక్రవర్తి అల్లాఉద్దీన్ సేనానాయకుడగు మాలికుకాఫరు ౧౩౦౯లో తిరిగి ప్రచండ సైన్యముతో వచ్చి పట్టణమునకు ఒకమయిలు దూరమున విడిసెను. అప్పట్టి రక్షణోద్యోగమున మహమ్మదీయ సైనికులు తోపు

చాలమంది హతులైరి. అయినను మహమ్మదీయులదే పై చేయిగా నుండెను. కోటలోని వారి ధైర్యము సన్నగిల్లెను. సైన్యబలము తగ్గెను. కాకతీయ ప్రతాపరుద్రుడు ఢిల్లీసుల్తానునకు లోబడి కప్పము గట్టుటకు నొప్పుకొని నానా అలంకారములు పంపెను. పరిహారముగా ఎంతో ధనము నిచ్చుటకు ప్రయత్నించెను. కాని అలూఫ్ ఖాను ఈ రాయబారములను తిరస్కరించెను. అయితే ఒక నెల నుండి ఢిల్లీవార్తలు ఏమియు తెలియకుండెను. ఢిల్లీలో రాజ్యవిప్లవము సంభవించినట్లును, రాజవంశమున మహాద్రోహులచేత ప్రాణహానులు జరుగుచుండినట్లును వదంతులు పుట్టెను. మహమ్మదీయ సైనికులు మెల్లగా జారిపోసాగిరి. ఈ పరిస్థితులవల్ల అలూఫ్ ఖానుడు ముట్టడి నెత్తివేసి దేవగిరికి పరుగెత్తిపోయెను. ఈ స్థితిలో సుల్తాను తనకుమారుని గొప్పసైన్యముతో సహాయముగా బంపెను. ఈ సైన్యసహాయముతో నాలుగు నెలల తరువాత అలూఫ్ ఖానుడు తిరిగి ఓరుగంటిపై బడెను. అనతి కాలపు ముట్టడి తరువాత ఓరుగల్లు పట్టణము పూర్తిగా మహమ్మదీయుల వశమయ్యెను. రాజును, అతని కుటుంబమును, ఉన్నతోద్యోగులను చెరబట్టిరి. వీరినందరిని ఢిల్లీకి గొనిపోయిరి.

ఓరుగంటికి సుల్తానుపూరు అని నామకరణము చేసి తురుష్కులేలసాగిరి. తరువాత ప్రతాపరుద్రునకు బంధవిముక్తి చేసిరి. అతడు తిరిగి రాజ్యమునకు వచ్చెను. కాని ఎక్కువ కాలము జీవించలేదు. అతని తరువాతి రాజ్యమునకు వచ్చిన వీరభద్రుడో, కృష్ణనాయకుడో (కృష్ణమనాయకుడో) అయి

౧౨.

# వేల్పుగొండ కథనము:

వేల్పుగొండను ఇప్పుడు "జఫరుగడ్" అనుచున్నారు. ఇది జఫరుద్దౌలా అను ముస్లిం పీరుని పీర విహారమునకు తావలమయి, నివాసస్థానమయి ప్రఖ్యాతి చెంది యుండుటచే "జఫరుగడ్" అను నామాంతరము దాల్చి వ్యవహారమున నిలచియున్నది. దీనికి విజానగరమని యుమరియొక పేరు గలదు. ఇది వరంగల్ జిల్లాలో నున్నది.

ఈ నగరము పూర్వమందు వడ్డెరాజుల రాజధానియై యుండెను. దీనిని గూర్చిన పూర్వ చరిత్రాంశములు అంతగా తెలియవు. కాని రాజకీయముగను, ధార్మిక విషయమునను పేరు ప్రఖ్యాతులు కలిగియున్నది.

జఫరుగడ్ దుర్గము ఒక పర్వతరాజముపయి నిర్మితమయి యున్నది. ఈ పర్వతము అగస్త్యమహర్షి పూజించిన సాలగ్రామమని ప్రశస్తి కలదు. ఇట్టి పర్వతముమీద వడ్డెరాజులచే పశ్చిమభాగము లేనగారనట్టి శిలామయమగు చోట నొక కోటనిర్మింపబడినది. ఈపర్వతముమీద నొక గుహాలో యోగా

నంద నరసింహస్వామి వెలసియున్నాడు. నరసింహాలయము నానుకొని పాదాలగుండమును, కొంతదూరమున స్నానాల గుండమును గలవు. స్వయంవ్యక్తుడయిన యీస్వామివారు రెండు జాముల వేళ స్నానార్థము గుండమున దూకుననియు చప్పుడు కాగలదనియు జనులు చెప్పెదరు. ఈ క్షేత్రమును పంచనృసింహ క్షేత్రమని పిలచెదరు. వీరనృసింహము, లక్ష్మీ నృసింహము, సుప్రసన్న నృసింహము, కొండసింగరప్ప అను నృసింహదేవులు నాలుగు దిక్కులయందు వెలసియున్నారు. మధ్య యోగానంద నృసింహుడు వెలసియున్నాడు. ఈ పర్వతముపయి ఎక్కువ లోతుగల జలాశయములు, కొన్ని గుండములు కలవు. ఈ గుండములలో అక్కసెల్లెండ్రగుండము, నూనె గుండము, పాలగుండము, అనునవి సుప్రసిద్ధములు కోటగోడలు శిథిలావస్థయందున్నవి.

దుర్గములోని కట్టడములలో లక్కమేడ యనునది అందమయినది. ఇదియు చాలవరకు వినాశ దేవతపాలయి యున్నది. కొండకు సమీపమున వేల్పుగొండ నామముతో గ్రామము కలదు ఈ గ్రామమునకు నాలుగు దిక్కులను నాలుగు ద్వారములు గలవు. ద్వారములకు కొయ్యతలుపులు నిర్మాణము లయియున్నవి. ఈద్వారములును, తలుపులును శిథిలావస్థయందున్నవి. ఈ ద్వారములలో హనుమకొండ దర్వాజ మంచిస్థితియందున్నది. దీనినానుకొని మంచి ప్రహరీ గలదు. పట్నముదర్వాజా శిథిలమయియున్నది గ్రామము

చుట్టును పూడిపోవుచున్న కందకము ప్రాకారపు జాడలు కనబడును. ఈ శిథిల చిహ్నములను బట్టి వేల్పుగొండ పట్టణపు గొప్ప ఘనత కొంతవరకు గ్రహింపవచ్చును. ఇచ్చటి కట్టడములలోని శిల్ప విన్యాసము చాళుక్య శిల్పమును బోలియున్నది.

జఫరుగడ్ దుర్గ నిర్మాణమును గావించి, బహువిధముల నలంకరించి, చరిత్రాత్మకముగా చేసినవాడు జఫరుద్దౌలా యను తురక వీరుడు. ఇతడు నిర్మలలోని ఒక సామాన్యగృహస్థుల తనయుడనియు, ధంసాయను పేరు గలవాడనియు మహారాజు కాదగు నని జ్యోతిష్కులు వచించినందున జఫరు అని నామకరణము చేసిరనియు తెలియుచున్నది. ఈ బాలుడు ఒక బ్రాహ్మణుని యొక్క పశువుల కాపరిగా నుండెనట! ఒక నాడు అరణ్యములో పసువులు గాచుచు పరుండి నిద్రపోయెనట! అప్పుడు సూర్యకిరణములు వీని మొగముపై బడుచుండగా, ఒక కృష్ణసర్పము పడగవిప్పి ఛత్రమువలె పట్టినదట. సకాలమునకు ఇంటికి రాకపోవుటచే ఆ బ్రాహ్మణ యజమాని వెదకుచు వచ్చి యీ విచిత్ర దృశ్యమును కనుగొనెను. వాడు చాల గొప్పవాడగునని భావించి బ్రాహ్మణుడు నాటినుండి వానిని విద్యావంతుని గావింపసాగెను. వాడు క్రమక్రమముగా పెరిగి విద్యావంతుడయి, శౌర్యధైర్యాది గుణ సంపత్తికలవాడయి, దృఢకాయుడయి, ప్రకాశింపసాగెను. అంత ధంసా హైదరాబాదునకేతెంచి, నిజాముగారి సేనలో నుద్యోగమును సంపాదించుకొని దివాను రుక్నుద్దౌలావారికి ప్రియుడయి యుండెను.

ధంసా బొబ్బిలిలో నుండగా వేల్పుగొండ కోటలో కొండెడు రామసింగు, నరసింగభాను అనువారు వచ్చి యాతని కొలువులో చేరిరి. వారి ఆలోచనయు మార్గదర్శకత్వమును తోడుపడగా ధంసా ౧౩౦౦ ల సైన్యమును వెంటగొని పిట్ల మొప్పారము మొదలగు గ్రామముల మీదుగా వేల్పుగొండకు వచ్చెను. పర్వతపు పశ్చిమ శృంగమున వొడ్డె రాజులు నిర్మించిన కోటయు, అప్పటి ప్రకృతి రామణీయకమును ధంసాను ఆకర్షించెను. కావున దానిని స్వాధీనము చేసికొని తూర్పునైపు పర్వత భాగమును చుట్టివచ్చునట్లు ఖిల్లా నిర్మించ దలంచెను. ఇతడు నిర్మలలో కోటగట్టినాడట! జగత్యాల దుర్గమును ౧౬౭౭ లోనో ౧౬౮౮ లోనో కట్టించినాడట!

ధంసా తన మిత్రుడగు దివాన్ రుక్నుద్దౌలా వారికి తన ఆశయమును దెలుపగా, దివాన్‌గారు వీనిని మంచి ఆదాయము గల ఏడుసర్కారీలకు అధికారినిగా జేసెనట! అప్పుడే యితనికి జఫరుద్దౌలా అను బిరుదనామ మొసంగెను.

జఫరుద్దౌలా ఖిల్లా మరమ్మతునకు కడంగెను. వేల్పుగొండ మార్గములో జగన్నాథహజారి, జగ్గుపంతులు, ఘిరిహొమ్మండ నాయకులు అనువారిని కావలిగానుంచెను. ఇతని ప్రియురాండ్రగు తులసి, మణి అను వేశ్య లిరువురును గొండలోనే యుండిరి. ఇట్లు వేల్పుగొండలో ఏర్పాటు చేసి జఫరుద్దౌలా పరివార సమేతుడయి, వేల్పుగొండ దుర్గ

నిర్మాణమునకు కావలసిన ద్రవ్యము పార్జనకు పాలవంచ సంస్థానమును ముట్టడించి రాజా న॰ సింహ అశ్వారావును ఖండించి, అశ్వారావుపేటను స్వాధీనము చేసికొనెను. (౧౭౬౧)

వేల్పుగొండ దుర్గమును మరల స్వాధీనము చేసికొనుటకు కొందరు హిందూ రాజులు ప్రయత్నించినట్లు కనబడుచున్నది. అందు ముఖ్యముగా, కోదూరువారు, రాపాకవారు, పొట్లపల్లి వారు, వీరారెడ్డివారు, అను నలుగురు దేశముఖుల్ను ధంసాచే నష్టపడిన వారగుటచే వానిపయి పగసాధించుటకు నిశ్చయించిరి. ధంసా వేల్పుగొండలో లేడను వార్తవిని ధంసాకు అర్థాధికారుడగు జగ్గు పంతులతో రహస్య మంత్రాలోచనలు సలిపి, సంధిచేసికొని మోసముగా కోట స్వాధీన పరచుకొనుటకు సంకల్పించిరి. జగ్గుపంతులును, బ్రహ్మండ నాయకులును దూరమయిన ఆలోచనలు చేసి స్వలాభ ప్రీతులయి కోటను నలుగురు దేశముఖుల పరము గావించుటకు సంసిద్ధు లయిరి.

ధంసా అశ్వారావుపేటను కొల్లగొట్టి ధనమంతయు దోచుకొని బండ్లపయి, గుఱ్ఱముల పయి సామానుల పెట్టించుకొని వచ్చుచుండగా, దేశముఖులకును జగ్గుపంతులకును జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో నొక్కటి వాని చేతులలో పడి. జగ్గుపంతులుయొక్క కృత్రిమప్రయత్నమంతయు వాని కవగతమయ్యెను. ధంసా ఏమియు పైకి పొక్కక ప్రయాణము చేయుచు । త్రోవలోని ధొర ను దోచుకొనుచు అపారధనము

# అంకితము

---

ప్రథమాంధ్ర గ్రంథాలయము

శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ స్థాపకులును,

శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి అధ్యక్షులును,

ఆంధ్రభాషా పోషకులును

అగు

## శ్రీ రాజానాయని వెంకటరంగారావు

బహద్దరు, మునగాల సంస్థానాధీశ్వరులవారికి

కృతజ్ఞతాపూర్వకముగ

సమర్పితము

ఆదిరాజు వీరభద్రరావు.

# FOREWORD

"It is impossible for one to obtain salvation, who lives in a town covered with dust". So says Baudhayana Dharma Sutra (II 3.6-33). The Vedas make occasional reference "to the cities of Dasyus" and in the Dharma-sastras cities are dispised. Nevertheless cities have existed in India from very ancient times as seen from Pre-Aryan cities in the Indus Vally sites. Megasthenese, writing about 300 B C. described Pataliputra as over nine miles in length. References to and descriptions of cities and city organisations in Budhist Literature (especially Milindapanho, in Kautilyas Ardha Sastra, 'and in the Epics) as well as the representations in early Budhist reliefs all suggest that in the Maurya period we have already to do, not with any new developments, but with the continuation of long established and familiar type of urban organisation.

The cities described by the author of this work Sri Adiraju Virabhadra Rao are all in Telangana and are practically all cities famous in medieval times. Medieval Telugu and Sanskrit inscriptions reveal the magnificence of these cities. A well known inscription at Hanuma-konda gives an excellent description in four verses of the city of Hanumakonda as it existed in A. D. 1163 when the inscription was issued. Since no quotation is given from this inscription in this book, I may quote here four verses only from this inscription.—

A capital city named Anumakonda, which was like the capital of the Goddess of fortune, raised to a great state by the rise of the excellent and full grace (lila) of God Siva, who was there: which was full of delight (Rati) like the city of Cupid, which had the display of the feeling of love like the city of Indra, (which) had Indra and Vishnu (as images in its temples) and (which) beautiful with the charm of plantain trees (with the amours of Rambha) (V 42)

2. Where, the women were indeed the metropolis of Cupid, having eyes like the petals of the blue lotuses and slim bodies, (they were like) ornaments to the women of the three worlds, and had bodies weighed down by the weight of big and high breasts. (V. 43)

3 (Where) in the houses of the excellent Brahimins clever parrots join the students, though prevented, and study the Vedas (which contain) all the Vedangas all appropriate subjects, beautiful histories and (which are) in studied pada order. (V. 44)

4. (and where) in the houses of Courtesans the loud and sweet sounds of young priests make all the quarters resound......(parrots) imitating the sounds of amorous sports in sexual enjoyment, which are during day-time like full moon to the billowing ocean of the pride of the love of men about town. (V. 45)

Another inscription, this time from Ganapavaram in Nalgonda District, describes Ganapavaram as a grand city in A. D. 1214.

1 ——With......martial shows of mighty warriors fighting with arms in certain places, with the reading of

sweet and clear verses of the panegyrists in certain places, with the sounds of the music of ladies (resembling the sounds of lutes) in some other places with the noise of the debates of learned brahmins in certain other places: with the merchants talks regarding the prices of gems in whose city shines for ever the assemblage of all kinds of prosperity. (V. 11-12)

2. He created the place called Ganapati-Pura, resorted to by good men, resounding with studies of all arts, rich in shops and beautified by gardens. (V. 15)

Mr. A. Virabhadra Rao's patriotism, his love for Telugu literature and his infection enthusiasm for Andhra history is well known. His facile pen paints a word picture of factual detail. "The ancient Andhra cities" part I is a useful book for the young students as well as the general reader. This second editon of this book will supply a felt need by the Telugu Reading Public.

HYDERABAD-DN

16—6—1951

P. SREENIVASA CHARYULU
M.A.PH.D. (London)
Direc'or; Archaeological Dept.,
Hyderabad State

## OPINION

Mr. Adiraju Veerabhadra Rao, sometime Senior Telugu Pandit in Chaderght Higah School, has given several Radio talks on the ancient cities of Andhras in Hyderabad State. Among them Kondapur, Rajkonda and Warangal deserve special mention. He has done great service by publishing these talks in one volume. They are sure to inspire the younger generation and remind them of the glories achieved by the Andhras during the Past. The Andhras as described by Magasthenese (Cir 302 B. C ) "were a powerful race possessing numerous villages and thirty towns defended by the walls and towers which supplied its kings with an Army of ten thousand Infantry, two thousand cavalry and one thousand elephants". It is necessary that the younger generation should in particular be reminded of the great achievements of their remote and distant ancestors. As regards the literary merits of the book I am not competant to say any thing. But it is sufficient to mention that the book has been prescribed as a text book by the Educational Department. I only wish that Mr. Adiraju be spared health and long life to produce many more works of literary and cultural value.

HYDERABAD-DN.

30--5--1951

KHWAJA MUHAMMAD AHMED
Asst. DIRECTOR
Archaeological Dept.,
Hyderabad State

# ప్రస్తావన.

"ప్రాచీనాంధ్ర నగరములు" అను నీ పుస్తకము ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో నాల్గవ కుసుమముగా 5-2-1950 తారీఖున ప్రకటితమయి యుండెను. గ్రంథమాల ప్రోత్సాహము లేనిది యీ కథనములు ఇంతలో ప్రకటితమయి యుండక పోవును. దీనిని సుందరముగా ప్రకటించి నన్ను ప్రోత్సహించిన గ్రంథమాల వారికిని, అందు ముఖ్యముగా ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి నే నెంతయు కృతజ్ఞుడనయి యున్నాను.

ప్రథమ ముద్రణపు ప్రతు లన్నియు అయిపోవుట చేతను, హైదరాబాదు సర్కారు విద్యాశాఖాధికారులును, ఆంధ్రసారస్వతపరిషత్తు వారును పఠనీయగ్రంథముగా దీనిని నిర్ణయించినందునను దీని నిప్పుడు స్వయముగా ముద్రణము గావించియున్నాను.

మొదటి కూర్పునందు గ్రంథమాల సభ్యులగు శ్రీ నూకల నరోత్తమరెడ్డి, ఎం.ఏ.గారు సంపాదకీయ భూమిక వ్రాసి నన్ను సంభావించిరి. ఆ సంపాదకీయ భూమికను, నేను వ్రాసిన ప్రస్తావన వివరములను ఈ ముద్రణమునందు విస్తరభీతిచే వదులుకొనవలసి వచ్చినందులకు మిగుల చింతిల్లుచున్నాను.

ఈ ద్వితీయ ముద్రణమునకు నేను కోరినంతనే అర్థశాఖాధ్యక్షులగు డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యుల ఎం.ఏ.పి.హెచ్.డి (లండన్) గారు దయతో తొలిపలుకు వ్రాసి

యిచ్చియున్నారు. శ్రీ వారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాద ములు సమర్పించు కొనుచున్నాను. ఆర్ష శాఖకు ఉపాధ్యక్షు లయిన జనాబు ఖ్వాజా మహమ్మదు అహమదుగారు ఎంతో సౌజన్య భావముతో నన్నాదరించి, నా పుస్తకము పయి సదభి ప్రాయము నొసంగి యున్నారు. శ్రీ ఖ్వాజాసాహెబుగారికిని నా ధన్యవాదములు. ఈ రెండింటికి తెలుగు అనువాదముల నిచ్చుఅవకాశము నాకు లేక పోయినది.

ఈ ముద్రణమునకు ఓరుగల్లు, పానుగల్లు, భోనగిరి, గోలకొండ నగరములకు సంబంధించిన ఏడుబ్లాకులు దయతో నొసగిన ఆర్ష శాఖ వారికిని, అలంపురమునకు సంబంధించిన బ్లాకులనిచ్చిన శ్రీ గడియారం రామకృష్ణశర్మగారికిని, గ్రంథకర్తకు సంబంధించిన బ్లాకు నిచ్చిన ఆంధ్ర చంద్రికా గ్రంథమాల వారికిని నేనెంతయు కృతజ్ఞుడనై యున్నాను.

పఠనీయ గ్రంథముగా నిర్ణయించి నన్ను ప్రోత్సహిం చిన విద్యాశాఖ వారికిని, ఆంధ్ర సారస్వత పరిషత్తు వారికిని ధన్యవాదములు సమర్పించు కొనుచున్నాను.

ద్వితీయ ముద్రణమునకుగాను ప్రథమ ముద్రణము నందలి స్ఖాలిత్యములను సవరించి యిచ్చిన మిత్రవర్యులు పండిత పెనవలి లింగయ్యశాస్త్రుల వారికిని, ఈముద్రణ కార్యమును శీఘ్రకాలములో నిర్వహించి పరిశోధించిన వాణీముద్రణాలయాధికారులు శ్రీ నట్టిఅప్పారావుగారికిని నా ధన్యవాదములు.

78 ఆజంపురా.<br>
హైదాబాదు.<br>
16–6–1951.

విధేయుడు<br>
ఆదిరాజు–వీరభద్రరావు

# ప్రాచీనాంధ్ర నగరములు.

"అదియే రమ్యపురంబు ప్రాజ్యచరితుం
    డా రాజు సామంతమండలం
బది పార్శ్వంబున నా విదగ్ధ సభ యా
    రక్తాస్య లత్యున్నతం
బది రాజన్యక మధ్య వందినికరం
    బా గాథలున్ సర్వమున్
గదలం జేసిన కాల మూర్తికి నమ
    స్కారంబు సత్కీర్తికిన్"

భర్తృహరి.

# ఆలంపుర కథనము

ఆంధ్రదేశములో చారిత్రకముగను, మత విషయకముగను ప్రఖ్యాతి కెక్కి వైభవసంపన్నమయి వెలసిన పురవరములలో అలంపురము గణనీయ మయినట్టిది. ఇది రాయచూరు జిల్లాలో నున్నది. తుంగభద్రానదీతీరమున నెలకొనియుండి ప్రకృతిరామణీయకమయి తనరారుచు, సమస్త సౌకర్యములతో నొప్పుచున్నది.

ఈ పుర మెప్పుడు నిర్మితమయినదో సరియైన చరిత్రాంశములు తెలియుటలేదు. అయినను ఇది అత్యంత ప్రాచీనమయినదని చెప్పవచ్చును. శ్రీశైలమునకు అలంపురము పశ్చిమద్వారమని ప్రసిద్ధికలదు. కావున శ్రీశైల క్షేత్రముతో సమానమయిన వయఃకాలము గలిగిన దని సూచించుచున్నది. రెండు మూడు వేల సంవత్సరములకు పూర్వమే ఇది నిర్మితమయి యుండవచ్చును.

అలంపురములో "జోగులాంబ" నామాంకిత దేవాలయము ఇప్పటికిని గలదు. ఈ జోగులాంబను అత్యంత పురాతన కాలములో "యల్లమ్మపురము" అని పిలుచుచుండిరనియు, "యల్లమ్మపుర" మను పదమే క్రమముగా మార్పులు చెంది అలంపుర మయినదనియు వాదము కలదు. మరియొక ప్రవాదమును బట్టి చూడగా, ఈ పురము మిగుల విస్తారముగా పెరుగుచు పోవుచున్నందున ఒకానొక మునీశ్వరుడు "అలం

పురీ'' అన్నాడట! అలంపురీ అనగా, ''పురమా! ఇకవద్దు''
అనగా ప్రవృద్ధి వద్దు అని భావము. అంతటితో పురవిస్తరణ
మాగిపోయినదని చెప్పుచుందురు. శాసన లేఖనములలో
దీనికి 'హతంపుర' మను నామ ముండినట్లు తెలియుచున్నది.
'హతంపుర ప్రతీతమహోదయః' అని వర్ణిత మయియున్నది.
బ్రహ్మేశ్వరుని నిలయమగుటచే కాబోలు దీనికి బ్రహ్మపురి
అనియు నామాంతరమున్నట్లు శాసనములవల్ల తెలియు
చున్నది. విద్యా పీఠమగుటచే విద్యాపురి అనియు ఇంకొక పేరు
వాడుకలో నున్నది. ఈ పేర్లనుబట్టి చూచినచో ఈ పురము
సామాన్య నగరముగా నుండినట్లు కనబడదు. చివరకు నిలిచి,
ప్రసిద్ధికెక్కి, ఇప్పుడు ప్రచారములో నున్ననామము ''అలం
పురము.''

ఈ నగర మిప్పుడు శిథిలమయి చాలవరకు తొంటికళను
గోల్పోయి కనబడుచుండును. ఈ పురమిప్పుడు రాజకీయ
ముగ ప్రాముఖ్యత లేకపోయినను మత విషయకముగ నింకను
పేరు ప్రఖ్యాతులను కలిగియున్నది.

అత్యంత పురాతన కాలములో ఈ పురమునకు దేవుడే
రాజుగానుండె నట! చారిత్రకముగ మనము విచారించినచో
శాసనములను బట్టి ఇది కల్యాణి పశ్చిమచాళుక్యుల పరిపాలన
లోనున్నట్లు తెలియుచున్నది. చాళుక్య చక్రవర్తుల సామం
తులు అలంపురమును రాజధానిగా చేసికొని పరిపాలించు
చుండిరి. ఈ సామంతరాజులు ఆంధ్ర చోడులుగా నున్నారు.
చాళుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుని రాజ్యారంభకాల

మగు క్రీస్తుశకము ౧౦౨౬ నుండి చారిత్రకాంశములు కొంత కొంత వరకు తెలియుచున్నవి. త్రిభువనమల్లుడు, త్రైలోక్య మల్లుడు, భువనైకమల్లుడు మున్నగు చాళుక్య చక్రవర్తులతో అలంపురమునకు సంబంధముగలదు. మహాస్థానాధిపతి ధర ణీంద్రరాశి పండితుడు, మహాస్థానాధిపతి సోమేశ్వరరాజ భట్టారకుడు, మహామండలేశ్వర మల్ల మహారాజు. మహా మండలేశ్వర నిరువడిచోళమహారాజు, బద్దెన చోడమహా రాజు, శ్రీమద్వొడ్డరావుల దండనాయకుడు, మహామండలే శ్వర అత్యంబరగండ సోమాదిదేవ మహారాజు మున్నగు వారు పాలకులుగానుండిరి. తరువాత కాకతీయులు, రెడ్లు ఈ పురమునకు పాలకులుగా నున్నట్లు తోచుచున్నది. ౧౬వ శతాబ్దములో బిజ్జల తిమ్మభూపాలుడు అలంపురి రాజుగా నుండెను. ఈరాజన్యుడు సంస్కృతములో మురారికవి రచిం చిన అనర్ఘరాఘవ నాటకమును పద్యప్రబంధముగా విర చించి, ఆంధ్రవాఙ్మయ చరిత్రలో గణుతికెక్కియున్నాడు. ఇతడు వనపర్తి సంస్థానాధీశ్వరులగు అష్టభాషాగోపాల రాయని మేనల్లుడు ఈ పురమునుగూర్చి చరిత్ర పరిశోధన ఇంక నెంతో చేయవలసియున్నది. పరిశోధనాంశములు బయటపడిన కొలది ఈ పురముయొక్క ప్రాచీనత, ఔన్న త్యము, వైభవము, సౌందర్యము వెల్లడి కాగలవు.

చారిత్రకాంశములు మనకెక్కువగా తెలియకపోయి నను, ఈ పురముయొక్క ఘనతను జాటుటకు శిథిలావస్థ లోనున్నను, ఇంకను హృదయము నాకర్షించుచు మనలను

విభ్రాంతులను చేయగలుగు చారిత్రక చిహ్నములు పెక్కు గలవు. వైభవ దశలో ఈ పురము ఎట్లుండెనో ఊహించ వలసినదేగాని వర్ణించుట కలవిగాదు.

ఇప్పుడు కనబడు చిహ్నములన్నియు మహిమయుక్తమైనట్టివి. ఈ పురము పురాణ ప్రసిద్ధిగల గొప్ప శైవక్షేత్రము. ఇచ్చట సుమారొక చదరపుమైలు వైశాల్యముగల కోట గలదు. ఈ కోటలో పెక్కు దేవాలయములు గలవు. ఇచ్చటి శివునకు బ్రహ్మేశ్వరుడను నామముగలదు. ఇట్టి నామముగల శివాలయములు మరెచ్చటను అంతగా కనబడవు. ఈ కోటలో తుంగభద్రకు సమీపముగా ఉత్తరదక్షిణపు వరుసగా బాల, కుమార వీర, విశ్వ, తారక, గరుడ, అర్క, స్వర్గ, పద్మ బ్రహ్మేశ్వరు లనబడు నవబ్రహ్మేశ్వరుల దేవాలయము లొక్కరీతి శిల్పముతో నొప్పుచున్నవి. ఈ దేవాయతనముల శిల్ప చాతుర్యము అచ్చెరువు గొలుపుచుండును. కొంచెమైనను సున్నము నుపయోగించక రాలను మలిచి, తొలిచి, ఈ ఆలయములను గట్టియుండిరి. వీటిపయి శిల్ప విన్యాసమును గులుకుచుండెడి లతలు, పుష్పములు, విగ్రహములు, కన్నుల పండువుగా చెక్కబడినవి. పవిత్రతను అందమును మూఢులు చెడగొట్టినారు. దేవాలయ శిఖరములు పిరమిడులవలె చతురాకారముగా వెలసి, సూక్ష్మమైన వేరువిధమైన శిల్పచాతుర్యము గల శిఖరములతో పరిష్కృతమయి ప్రకాశించుచుండును.

నవబ్రహ్మేశ్వరులలో బాలబ్రహ్మేశ్వరుడు మాత్రము కళావంతుడయి పూజ తీసుకొను దర్శనయోగ్యుడుగా నున్నాడు.

ఈ లింగము పలుగాను. లెక్క, దద్రాక్ష మొదలయిన వానితో కప్పబడి యున్నట్లు తోచుచున్నది. మఱియు స్థల పురాణములో కర్పూరలింగమని విఖ్యాతి చెందియున్నది. ఇంకొక విచిత్ర విశేష మేమనగా, ఎన్ని నేల కడవలతో నభిషేకము చేసినను ఒక చుక్కయయినను బయటికి రాదు, ఎక్కడికి పోవునో తెలియదు. బాలబ్రహ్మేశ్వరుడు ఈ క్షేత్రపు ప్రధాన దైవము. ఈ దేవాలయ సింహద్వారము ముందటి సోపానముల నుండియే తుంగభద్రానది ప్రవహించుచు, బాలబ్రహ్మేశ్వరునకు పాదాభివందన మొనర్చుచుండిన స్థానము.

గల త్రిలోచనమను ఘట్టము, ఉత్తర ప్రవాహమును బట్టియు నీ క్షేత్రము కాశితో సమానమయిన దని ప్రశస్తి కలదు. కాశిలో వలెనే ఇచ్చటను మణికర్ణికాఘట్టము, పాపనాశన ఘట్టము, హరిశ్చంద్ర ఘట్టము, మున్నగు అరువది నాలుగు ఘట్టములు కలవు. ఇచ్చట కోటిలింగములున్నవట! ఇప్పటికిని లెక్క తేలలేదు. దేవాలయములు పెద్దవి, చిన్నవి ౧౦౦ కి పైగానున్నవి. కాశిలో మరణము దుర్లభమని చెప్పెదరు. అయితే, ఇచ్చట నివాసము దుర్లభమట! హతంపురమను నామమునుబట్టి యీపురము శాపగ్రస్తమయి యుండనోపును. అందుచేత నివాసమునకు దుర్లభమైనదేమో! శివభక్తు లెచ్చటెచ్చటినుండియో యిప్పటికిని వచ్చి దేవుని సేవించుకొని పోవుచుందురు.

అలంపురములోని దేవాలయములలో జోగులాంబ ఆలయము పేర్కొనదగినది. ఈ దేవతనే ప్రాచీనకాలములో "యల్లమ్మ" అనుచుండిరట! ఈమె ఆదిశక్తి. శ్రీ ఆదిశంకరులవారు పేర్కొనిన అష్టాదశ శక్తిపీఠములలో నిది యొక్కటి యయి యున్నది. కంచికామాక్షి, మధుర మీనాక్షి, కాశీవిశాలాక్షి మొదలగు శక్తి స్వరూపిణులతో సమానమైనట్టిదీ జోగులాంబ. ఈ పరాశక్తి విగ్రహము భయంకరమైనట్టిది. ఈ జోగులాంబ ప్రభావమును విశేషముగ చెలువుచున్నారు.

నగ్నత్వమున, శిరోవిహీనముగ రేణుకాదేవి విగ్రహము కలదు. అసభ్యత్వమున నొప్పు నీవిగ్రహముండుట సుప్రసిద్ధ శైవ క్షేత్ర సంప్రదాయమని తెలియుచున్నది.

ఈ ఆలయముల నొకరససిద్ధుడు గట్టించెననియు, శిల్పులకు, పనివాండ్రకు నొసగవలసిన భృతికి తుంగభద్రలోని యిసుకను ప్రోవుచేసుకొమ్మని, యాకుప్పలపయి పసరును పిండువాడనియు, అట్లుచేయగా నెవ్వరెవ్వరెంత శ్రమయొనర్చిరో యందులకుం దగినట్లుగా కాంచనము లభించెడిదనియు చెప్పుచున్నారు. అతడీతీరున నాలయములను గట్టించి ప్రతిష్ఠసలిపి, తన పేరితో నొక శిలావిగ్రహమును చేయించి యుంచినాడని యొక విగ్రహమును చూపించుచున్నారు. ప్రదక్షిణ మొనర్చుటకు అనువయిన యాలయాంతర్భాగమున గర్భాలయపు గోడలో రససిద్ధనాయకుడని గణపతివిగ్రహము కలదు. దీనిని ఆలయము గట్టించిన రససిద్ధు



జయసింహ వీరగల్లు—ఆలంపురము



నటరాజస్వామి: ఆలంపురము

డిసుకతో పసరుల బలమున నిర్మించెనని తెలియుచున్నది. స్పృశించినమాత్రాన ఇసుకగా రాలు నీ విగ్రహము స్వయం వ్యక్తమని తోపజేయుచున్నది.

గ్రామమునకు మధ్యభాగమున సూర్యనారాయణాల యము గలదు. ఆలయ పైభాగమున అష్టదిక్పతులు వాహ నారూఢులయియున్నట్లుగ జిత్రింపబడియున్నది. ఆ పక్కను దశావతారములు కూడ జిత్రింపబడియున్నవి. వాని క్రింద వృక్షముక్రింద— బుద్ధుడు కాబోలు— బోధించుచున్నట్లున్నది.

దక్షిణమువైపున నరసింహాలయముగలదు. ఇందలి యుత్సవ విగ్రహములును, నరసింహ విగ్రహమును దివ్య సుందరములు. ఇచ్చటి కోటగోడలోనుండి నాల్గయిదు మోటల నీటిప్రవాహ మొకటి తూర్పుగా తుంగభద్రలో పడుచున్నది. ఇది యెచ్చట పుట్టినదో గ్రహించుటకు వీలు లేదు. నీరు కొంకాయపాలను బోలి నిర్మలముగా నుండును.

కోటకు నుత్తరముగా మూడు నాలుగు మైళ్ళవరకును తుంగభద్రయొడ్డున పెద్దగ్రామముగానుండి శిథిలమయిన చిహ్నములు గానవచ్చుచున్నవి. అందందు ఆలయపుటడుగు ప్రదేశములు, ఆలయ శిల్పములు, నందులు, లింగములు, అనేకములు గానవచ్చుచున్నవి. విశేషము తుంగభద్ర ప్రవాహపు టిసుక క్రింద కప్పబడియున్నట్లును, త్రివ్వుట గల్గిన నేవేని విశేషములు బయల్పడగలిగి యున్నట్లును దోచుచున్నది.

# ప్రాచీనాంధ్రనగరములు

బ్రహ్మేశ్వరాలయమునకు నైరుతిమూలమున దక్షిణముగా వివిధ విగ్రహములమధ్య రాక్షస ముఖముతో నొక విగ్రహము నిల్చియున్నది. దీనిని గురిగింజ మాధవుడందురు. ఇతడొక చేత వరిముల్లును బట్టుకొని, కాలిక్రింద నొక అగ్నిగుండమును గలిగియున్నాడు. కాశీ క్షేత్రమునకంటె వరిముల్లంత తక్కువ ప్రభావముగల దీప్రదేశమను వారిని అగ్నిగుండమున పడద్రోసి త్రొక్కెద నని చూపుచు చున్నాడట!

గ్రామ మధ్యమందును, బాలబ్రహ్మేశ్వరుని ఆలయమునను రెండు పెద్ద సాలంకాయనలింగములు నాలుగు లింగములతో నొప్పుచున్నవి. మహిషాసుర మర్దని ఆలయము, వేంకటేశ్వరాలయము, కామాక్షి ఆలయము, వీరభద్రస్వామి ఆలయము, మొదలగునవి కలవు ఇప్పుడు బాలబ్రహ్మేశ్వరాలయము, సూర్యనారాయణాలయము, నరసింహస్వామి ఆలయము, వేంకటేశ్వరాలయము, జోగులాంబదేవి ఆలయము, వీరభద్రస్వామి ఆలయము అనునవి పూజాదులను గలిగియున్నవి. మహోత్సాహముతో సంవత్సరమునకొకసారి గొప్పగా వీటికి జాతరలు జరుగుచుండును.

కోటగోడకుపయోగించిన రాళ్ళలో ననేకములు బౌద్ధ జైన చిహ్నములు కలిగియున్నవి. సూర్యనారాయణాలయ సమీపమున నొకరు వృక్షముక్రింద బోధించుచుండినట్లు ఉన్నది. ఆ బోధించుచుండునది బుద్ధదేవుడేమో. ఇట్టి చిహ్నములను బట్టి యిది అత్యంత పురాతన కాలమున

బౌద్ధక్షేత్రముగనో, జైన క్షేత్రముగనో అయి యుండి యుండెనా?

ఇచ్చట పెక్కు వీరగల్లులు కలవు. వీరగల్లులనగా వీరుల స్వరూపములు చెక్కిన శిలలు. వీటిపై కొన్ని అక్షరములు చెక్కబడి యున్నవి. ఈ వీరులు రణరంగమున వీరశయనము నొందినవారుగా నున్నారు. కొన్ని వీరగల్లులు గోడలలో పూడిపోయి యున్నవి. సామాన్యముగ ప్రతి వీరగల్లుపయి ఒక విలాస పురుషుడు స్త్రీద్వయముతో విమానములో పోవుచున్నట్లు ఒక చిత్రముండును. యుద్ధమున మరణించిన వారికి వీరస్వర్గము లభించునని మన పురాణగాథలు నుడువుచుండునుగదా! అది సూచితము కాబోలు.

అలంపురములో పెక్కు శాసనములు కలవు. కాని యందు కొన్ని యాలయపు గోడలలో నిరికించబడి యున్నవి. కొన్ని మరుగులుగా పరుపబడియున్నవి. కొన్ని జనసంచారపు త్రొక్కుడులలో నరిగిపోయినవి. కొన్ని తుంగభద్రా నది ప్రవాహము వలన నేర్పడిన యిసుక మేట భూగతమయి యడంగియున్నవి. కొన్ని భిన్నము లయియున్నవి. కొన్ని దట్టమయిన సున్నపు పూతలలో నఘోరించుచున్నవి. వీనిలో కొన్నింటిపయి అత్యంత ప్రాచీన లిపి కనబడుచున్నది. వీటినన్నిటిని జాగ్రతగా పరిశోధించినచో నపూర్వమయిన చరిత్రాంశములు బయలు పడగలవని నిస్సందేహముగ నుడువవచ్చును.

మన పూర్వుల ధర్మ చింతన విస్తారమునకును, వితరణశీల ప్రదర్శనమునకును, కళాసౌందర్య లాలసత్వమునకును, అలంపుర క్షేత్రము ప్రబలదృష్టాంతముగా నున్నది.



శ్రీ:

# ఆనగొంది కథనము:

నగొందినగరము చిన్నదగు ఆంధ్ర సంస్థానము నకు రాజధానిగా తనరారుచు కొంత పేరు ప్రతిష్ఠలను కలిగియున్నది. ఆనగొంది సంస్థానము శ్రీ శ్రీ నిజాము ప్రభువు వారికి సామంత రాజ్యముగా నుండియుండెను. ఇప్పటి నూతన రాజకీయ వ్యవస్థా పరిణామముగా సంస్థాన ప్రత్యేకత్వమును గోల్పోయి హైదరాబాదు రాష్ట్రములో విలీన మయిపోయినది. కాని పురాతన కాలమున స్వతంత్ర రాజ్యముగానుండి ఆంధ్రచరిత్రయందు ప్రముఖపాత్రను వహించి యుండెను.

ఆనగొంది పురము తుంగభద్రానదికి ఉత్తర తీరమున నిర్మితమయి యుండెను. ఈ ఆనగొంది రాజన్యులే తుంగ భద్రానది దక్షిణతీరమున వెలసిన సుప్రసిద్ధ విజయనగర పట్టణనిర్మాణమునకు కారకులయి యుండిరి. విజయనగరము ప్రాముఖ్యమునకు వచ్చి ప్రబలినకొలది ఆనగొంది ప్రాముఖ్యము తగ్గసాగెను. సృష్టిక్రమమునసుసరించి విజయనగరము వినాశ దేవత పాలుకాగా, తిరిగి ఆనగొంది రాజధాని నామ గౌరవమునకు పాత్రమయ్యెను. ప్రస్తుతపు ఆనగొంది రాజన్యులు విజయనగర రాజ వంశీయులే యయి యున్నారు.

ఆనగొంది యనగా ఏనుగులకోనయని యర్థము. దీనిని బట్టి ఆ ప్రాంతము కిబిడారణ్యమనియు, ఏనుగు లెక్కువగా నుండు ప్రాంత మనియు తెలుచున్నది. ఈ అరణ్యమును కొట్టించి, ఆ పావన తుంగభద్రానదీ తీరమున పట్టణము కట్టించి, రాజ్యస్థాపనము గావించిన మహాశయుడెవ్వడో సరి యైన చరిత్రాంశములు కానరావు. రామాయణములో వర్ణిత మయిన కిష్కింధాపుర మిదియే యనియు, శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో మైత్రి చేసికొని వానరులను సీతాదేవి యన్వే షణార్థము నలుదిక్కులకు పంపినదిక్కడనుండియే యనియు, హనుమంతుడు సీతాసందేశమును గొనివచ్చి శ్రీరామునకు వినిపించినదిచ్చటనే యనియు, ఋష్యమూక పర్వతమిచ్చటనే యున్నదనియు చరిత్రకారులు భావించుచున్నారు.

చరిత్రలో ఆనగొంది పేరు యవనుల దాడితో పరిచిత మగుచున్నది. యవనులనే వారు ఆశియా గ్రీకులు. ఈ యవ నులు క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్ది ప్రారంభమున ఓఢ్రదేశములో ప్రవేశించిరి. క్రీస్తు శకము అయిదవ శతా బ్దములో వారచ్చటనుండి తరుమబడిరి. వారట్లు రాజ్య విహీనులయి బయలుదేరి మధ్యపరగణాలను జయించి, అచ్చటినుండి దక్షిణమునకు తరలి క్రీస్తుశకము ౫౧౫ ప్రాంతమున ఓరుగల్లులోని ఆంధ్ర రాజును జయించిరట! ఈ యవనరాజులు ౭౫౦ సంవత్సరములు రాజ్యము చేసిరట! వీరు క్రీ. శ. ౭౮౦ ప్రాంతమున రాజ్య విస్తరణము గావించుచు కొంత సముద్రతీర ప్రాంత ప్రదేశాలను సంపా

దింపగలిగిరి. ఈ ప్రాంతమునకు ఆనగొంది రాజధానిగా నుండెను. క్రీస్తుశకము పదియవ శతాబ్దములో యవనులు తమ రాజ్యాలను గోలుపోయిరి. అంతటితో ఈగ్రీకు యవను లందరు బౌద్ధమతావలంబులయి యవన నామమును గూడ గోల్పోయిరి. ఆనగొందిలో దేశీయ రాజులు ఏడువందల సంవత్సరములవరకు రాజ్యము చేసియుండిరి. విశేషము లేమియు తెలియవచ్చుటలేదు.

నందుడను రాజు క్రీ. శ. ౧౦౩౩ లో ఆనగొందిలో రాజ్యము చేయసాగెను. ఇతడు నలుబది మూడు సంవత్సరములును, పిమ్మట ఇతని కొడుకు చాళుక్యరాజు ౪౦ సంవత్సరములును ఆనగొంది నేలిరి. (౧౦౭౬–౧౧౧౭). చాళుక్యరాజు మొదటి కుమారుడు బిజ్జలుడే కల్యాణపురమునకు రాజయ్యెను. రెండవ కొడుకగు విజయధ్వజుడు ఆనగొందికి రాజయ్యెను. ఈ విజయధ్వజుడు ౩౯ సంవత్సరములు ఆనగొంది నేలెను, (౧౧౧౭–౧౧౫౬). విజయధ్వజుని తరువాత ఆతని పుత్ర, పౌత్ర క్రమముగా అనుమరాజు, రామదేవరాయలు, ప్రతాపరాయలు కాలక్రమానుసారముగా రాజ్యము నేలిరి. ప్రతాపరాయల కుమారుడు జంబుకేశ్వరుడు ౧౨౯౭ లో సింహాసనమెక్కి ౩౭ సంవత్సరములు మహా దక్షతతో, జనరంజకముగ ఆనగొంది రాజ్యమేలి ౧౩౩౪లో మరణించెను. ఆనగొంది నేలిన పూర్వరాజ పరంపరలో నీతడే కడపటివాడు.

జంబుకేశ్వరుడు పౌరుషశాలి యగుటచే, అప్పుడు ఢిల్లీ నేలుచుండిన మహమ్మదు తుఘ్లకునెదిరించి వర్తించు

చుండెను. జంబుకేశ్వరుని స్వాతంత్ర్య నిరతిని మహామ్మదు తుఘ్లుకు సహింపజాలక ఆనగొంది పయి దాడిసలుప సైన్యమును పంపించెను. పండ్రెండు సంవత్సరములు యుద్ధముజరిగెను. అయినను జంబుకేశ్వరుడు ఢిల్లీశ్వరునకు లోబడడయ్యెను. ఇంతలో ఢిల్లీశ్వరుని మేనల్లు డొక ఘోరాపరాధము చేసి, మహమ్మదు తుఘ్లుకుకోపానలమున పడి భ్రష్టుడుండ తప్పించుకొని పోయి జంబుకేశ్వరుని శరణుజొచ్చెను. జంబుకేశ్వరుడు వానికభయహస్త మిచ్చెను. జంబుకేశ్వరుని పయి యిదివరకే క్రుద్ధుడై యుద్ధము సలుపుచుండిన ఢిల్లీ సుల్తాను ఈ మేనల్లుని కారణమున మరింత ఆగ్రహావేశుడయి ప్రచండ సైన్యమును గూర్చికొని స్వయముగనే తెంచి, యుద్ధసంరంభమును నడుపసాగెను. కాని జంబుకేశ్వరుని జయించుట కష్టమనియే అతడు తలంచెను. అంత నా మేనల్లుని నాకప్పగించితివా యుద్ధముమాని వెడలి పోయెదనని సుల్తాను రాయబారములు ప్రారంభించెను. శరణాగతత్రాణ బిరుదాంకితుడగు జంబుకేశ్వరుడు వాని రాయబారములను త్రోసివేసి యుద్ధము చేయసాగెను. ప్రచండ సేనాబలముగల మొగలు చక్రవర్తితో పోరుట దుర్ఘటమయి పోయెను. అపజయము నిక్కమని తెలియగనే తురుష్కుల చేతబడకుండ, తన భార్యా పుత్రాదులను తనచేతిమీదుగా నఱకి, ఆ ఖడ్గ సహాయుడయి రణరంగమునకుఱికి ఘోరముగా బోరి జంబుకేశ్వరుడు వీరశయనము నొందెను. విజయుడయి మహమ్మదు తుఘ్లుకు ఆనగొందిని సర్వనాశనము

చేసి ఆయనకుదిని ఖయిదీగా ఢిల్లీకి తీసికొనిపోయెను. ఈ ఖయిదీలలో ఆనెగొందిరాజు ప్రతాపరుద్రుని కొమారుడు, కోశాధ్యక్షుడు పనిచేసినవారు, మిగుల బలశాలురు గొప్ప వరబాహులు. మంత్రిగానున్న హరిహరరాయలు, కోశాధ్యక్షుని పేరు బుక్కరాయలు.

హరిహరరాయలు, బుక్కరాయలు అనువారిద్దరు సోదరులు. ఓరుగల్లు కాకతీయ చక్రవర్తి కొలువులో గొప్ప ఉద్యోగములలో నుండిరి. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఈ సోదరులిద్దరు తమ అదృష్టమును పరీక్షించుకొనుటకు ఆనెగొంది చేరిరి. ఆనెగొందిరాజు వారి తెలివితేటలను, సాహస పరాక్రమములను గని ముగ్ధుడయి వారిద్దరిని తన కొలువులో చేర్చుకొని రాజ్య పరిపాలనాభారము వారిపయి వదలెను.

మహమ్మదు తుగ్లకు ఆనెగొందిలో మలిక నాయబు అనువానిని పాలకునిగా నియమించి ఢిల్లీకి వెడలిపోయెను.

ఆనెగొంది రాజ్యప్రజలు జంబుకేశ్వరుని యెడ భక్తి భావములు కలిగి వానిని దేవునివలె గౌరవించుచుండిరి. తమ ప్రభువట్లు నాశనముకాగా ప్రతీకార భావముతో మలిక్ నాయబుపయి తిరుగబడిరి. పారతంత్ర్యమును సహింపలేకుండ నున్న యీ ప్రజల యలజడి మలిక్ నాయబును గడగడలాడించెను. తాను పెద్ద సంకటములో నున్నట్లు ఢిల్లీకి విన్నప

ములు పంపుకొనెను. ఢిల్లీశ్వరుడు మిక్కిలి నష్టపడి యుండు టచేతను, అలసి యుండుటచేతను తిరిగి యుద్ధ ప్రస్థానమునకు జంకి తనయొద్ద చెరలోనున్న యీయిద్దరిని చెరవదలించి, ఆన గొంది రాజునకు నమాత్యశేఖరుడుగానున్న హరిహరరాయ లకు నానగొంది రాజ్యాధిపత్యము నొసంగి, తనకు సామం తుడుగా నుండునట్లు ఒడంబరిచెను. బుక్కరాయలను ఆన గొంది రాజ్యమునకు మంత్రిగా నియమించెను.

హరిహరరాయలు, బుక్కరాయలు అను సోదరు లిద్దరు ఈ విధముగా ఆనగొంది రాజ్యమునకు రాజును, మంత్రియు వరుసగా నయిరి. ఈ సోదరులే శ్రీ మాధవ విద్యారణ్యస్వాములవారి తపోబల సహాయముతో క్రీ. శ. ౧౩౩౬ లో విజయనగర నిర్మాతలయి, విజయనగర సామ్రా జ్యమునకు మూలపురుషులయి వన్నెకెక్కిరి. విజయనగర సామ్రాజ్యము ౧౫౬౫ లో తాళికోట యుద్ధమున సర్వనా శనము కాగానే, విజయనగరమును మసల్మానులు కొల్ల గొట్టుటయేగాక ఆనగొందినికూడ కొల్లగొట్టి ధ్వంసము చేసిరి. అప్పుడు విజయనగర రాజవంశీయుడగు రామరాయల తమ్ములు తిరుమలరాయలు పెనుగొండలోను, వేంకటాద్రి రాయలు చంద్రగిరిలోను రాజ్యములను స్థాపించుకొని యేల సాగిరి. చంద్రగిరి నేలుచుండిన, శ్రీరంగరాయలవారే క్రీ.శ. ౧౬౩౯ లో ఈస్టిండియా కంపెనీవారికి మద్రాసు ప్రాంత మును ఇచ్చియుండిరి. క్రీ. శ. ౧౬౪౬ లో చంద్రగిరిని గోలకొండ నవాబులు జయించిరి. అప్పుడు ఈ రాజవంశము

నకు ఆనగొంది యొక్క పేరే మిగిలిపోయెను. ౧౬౮౭ లో గోలకొండ మొగలుల స్వాధీన మయినతరువాత ఆనగొంది మొగలుల సామంతరాజ్య మాయెను. ౧౭౮౬ లో టిప్పు సుల్తాను ఆనగొంది నాక్రమించి అప్పుడు రాజ్యము చేయుచున్న తిమ్మప్పరాజును సింహాసనభ్రష్టుని గావించెను. అంతటితో నాగరిక మందిరములను కూలద్రోసి, పట్టణమును దగ్ధము చేసెను. ఇట్టి దారుణ కార్యముల మూలకముగా విజయనగర రాజవంశమునకు సంబంధించిన అమూల్య రేఖనములును నశించి పోయెను. టిప్పుసుల్తాను యుద్ధమునందోడి మరణించిన తరువాత బ్రిటిషు ప్రభుత్వమువారు ఆనగొంది రాజవంశీయుని గద్దెపైనెక్కించి, ఆరాజునకు రు ౧౨౦౦-౦-౦ లు మాసికభృతి ప్రసాదించిరి. ఇప్పుడు శ్రీ రాజా శ్రీకృష్ణ దేవరాయలవారు ప్రకాశమానులుగా నున్నారు. వీరు విజయనగర సామ్రాజ్య కడపటి చక్రవర్తియగు రామరాయల వంశజులయి యున్నారు.

ఆనగొంది నగరమును పదునారవ శతాబ్ది ప్రారంభములో నరసింగ రాయలవారు పాలించుచుండిరి. నరసింగ రాయలవారు పట్టణమునకు ప్రాకారవ్యూహములు నిర్మించి దుర్గమును బలిష్ఠ మొనరించిరి. వాయవ్య దిశనుండు కోట గోడ ౨౦ మైలు పొడవుండును. ఈ కోట గోడల నొరిసి కొనియే తుంగభద్రానది ప్రవహించుచుండును. అయితే ఈ కోటగోడ లిప్పుడు శిథిలావస్థలో నున్నవి.

## ౩.

# కల్యాణీ కథనము.

దక్షిణాపథము నేలిన రాజులలో చాళుక్యులు సుప్రసిద్ధులు. ఈ వంశీయులు రాజ్యమును పంచుకొనిరి. తూర్పున వేంగీ రాజధానిగా నేలినవారు తూర్పు చాళుక్యులయిరి. పశ్చిమమున కల్యాణి రాజధానిగా నేలినవారు పశ్చిమ చాళుక్యులయిరి. పశ్చిమ చాళుక్యరాజగు రెండవ పులకేశియు, తూర్పు చాళుక్యరాజులలో మొదటివాడయి ఆంధ్రుడని ప్రఖ్యాతికెక్కిన కుబ్జ విష్ణువర్ధనుడును అన్నదమ్ములగుటచే పశ్చిమ చాళుక్యులు ఆంధ్రగణములో చేరిన వారేయని చెప్పవలయును. పశ్చిమ చాళుక్యులను మహారాష్ట్రులనియు, కర్ణాటకులనియు నభిమానములను పురస్కరించుకొని వేర్వేరు విధముగా చరిత్రకారులు వ్రాసినారు. కాని ఇవి తరువాత పెట్టిన పేర్లు. చాళుక్యులును శాతవాహనుల వలెనే ఆంధ్రులు.

చాళుక్యులు సమిష్టి కుటుంబముగా నున్నప్పుడు వాతాపి (బాదామి) నగరము వారికి రాజధానిగా నుండెను. వాతాపి నగరములో నిలిచిపోయిన పశ్చిమ చాళుక్యులు కల్యాణి నగరమును క్రీ శ. ౧౦౫౦ లో రాజధానిగా చేసికొనిరి. ఈ కల్యాణి నగరము గుల్బర్గా జిల్లాలో నున్నది. దీనికి కటకమనియు, కల్యాణి కటకమనియు నామాంతరము లుండెను.

ఓరుగల్లు రాజధానిగా చేసికొనకముందే కల్యాణి యొక ప్రముఖనగరముగా నున్నట్లు తోచుచున్నది. కల్యాణి కటకాధీశుడగు బల్లహుండను వాడు 'నందగిరి' యని పిలువ బడుచుండిన నాందేడు రాజగు సోమదేవరాజును యుద్ధములో జంపెను. సోమదేవరాజు భార్యయగు రాణీ సిరియాలదేవి యప్పుడు గర్భవతిగా నుండెను. ఈ సిరియాల దేవి శత్రులపాలి పడకుండ హనుమకొండలోని మాధవశర్మ అను బ్రాహ్మణోత్తముడు శరణమిచ్చి రక్షించెను. ఈ రాణి కుమారుడే మాధవవర్మ. ఇతడు కాకతీయ వంశమునకు మూలపురుషుడయి విఖ్యాతి చెందెను. ఇది క్రీ. శ. నాల్గవ శతాబ్దములో జరిగిన కథ.

క్రీస్తుశకము ఆరవ శతాబ్దములో చాళుక్యరాజగు పులకేశి యనువాడు చోళరాజధానియగు కాంచీపురమును ధ్వంసము చేసినాడట. దానికి బదులుగా చోళరాజు కళ్యాణిని నాశనము చేసినట్లు ఒక శాసనమువలన తెలియుచున్నది. తరువాత నీ పట్టణము మెల్లగ కోలుకొని ప్రసిద్ధికివచ్చి సకల సంపత్ప్రాభవములతో తులదూగుచుండగా, పదియవ శతాబ్దములో రాష్ట్రకూట రాజగు రెండవ అకాలవర్షుడు కల్యాణిని స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నించినట్లు కనబడుచున్నది.

చాళుక్యరాజగు త్రైలపదేవుడను మూడవ విక్రమాదిత్యుని కాలములో అనగా క్రీ. శ. ౯౭౦ ప్రాంతములో

కల్యాణి నగరము రాజధాని యగు గౌరవమును పొందెను. ఈ వంశములో అయిదవ వాడగు సోమేశ్వరుడు పదునొకండవ శతాబ్దములో కల్యాణిని ప్రపంచములోని పట్టణములలో నందచందము లందును, వైభవము నందును మేలిబంతిగా నొనర్చెను. అంతే నితర రాజులకును దానిపయి మోహము కలుగసాగెను.

క్రీ. శ. ౧౧౫౦ లో రెండవ తైలపదేవుడు చాళుక్య సింహాసనమునకు వచ్చెను. అప్పుడు కాలచుర్య రాజగు బిజ్జలుడు తైలపదేవునోడించి కల్యాణిని స్వాధీనము చేసికొనెను. కాలచుర్యవంశ పతనానంతరము హొయిసళులును, యాదవులును కల్యాణితోపాటు చాళుక్య రాజ్యమును వరుసగా పాలించిరి.

పదునాల్గవ శతాబ్దములో గుల్బర్గాయందు బహమనీ రాజ్యము స్థాపితమయినప్పుడు కల్యాణి ఆ రాజవంశము వారి పరమయ్యెను. తరువాత నది విజాపుర నవాబుల స్వాధీనములో నుండగా, అహమదు నగరు నవాబు హుసేన్ నిజాం శాహ ఆక్రమించెను. ఈతనిపై విజయనగర రాజగు రామరాయలు దాడిసలిపి ఘోరముగాపోరి కల్యాణి పట్టణమును స్వాధీనము చేసికొనెను. రామరాయల కల్యాణి దండయాత్ర విషయమును—

“విశ్వామిత్రునిఁగొల్చి రాముఁడతఁ
డుర్విం జెందెఁ గళ్యాణముల్

విశ్వామిత్రులు గాల్వరాముఁ డితఁడు
దర్శింపఁ జేసెఁ గల్యాణముగ
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురుగ
సాధించు కల్యాణ బా
హైశ్వర్యంబులు ధర్మ నిర్మథన శ
రాశ్రితంబన వ్యక్తముగ."

అని రామరాజభూషణకవి రామాయణ కథాంశముతో పోల్చి చక్కని శ్లేషలో వసుచరిత్రయందు చమత్కరించినాడు.

అప్పటి లిఖితములను బట్టి చూచినను బిజాపూరు రాజ్యములో కల్యాణి అత్యంత సంపద్వృద్ధి గలిగి శోభావంతముగా నుండెను. ౧౬౩౫లో కనిపయి మొగలులు దాడి సలిపి, పురజనులను వధించి పట్టణమును భీభత్సము చేసిరి. అంతటితో నాగక ౧౬౫౬లో ఔరంగజేబు స్వయముగా సేనను నడుపుచు కల్యాణిని ముట్టడించెను. కోటలోనివారు పౌరుష ప్రతాపములు నెరపుచు యుద్ధము చేసిరి. బిజాపుర దండయాత్ర సందర్భమున "దేశమును కొల్లకొట్టండి. కల్యాణిలోని ప్రతి భవనమును, ప్రతి నిర్మాణమును, కూలగొట్టండి. ఆ ప్రదేశమును గ్రద్దలకును, గుడ్లగూబలకును నివాస యోగ్యము చేయుండి" అని ఔరంగజేబు తన పరివారమునకు పదేపదే తాకీదులు పంపసాగెను. కోటచుట్టు నుండిన కందకమును పూడ్చిరి. కోట బురుజులపై ఫిరంగు

లను గురిపెట్టి కాల్చి పడగొట్టిరి. కోట గోడలను కూల గొట్టిరి. ఔరంగజేబు అనుకొన్నంత పని జరిగెను. ఈ పురాతన పట్టణము సంపూర్ణ వినాశముపాలు అగుటకు ఔరంగజేబుయొక్క మతోద్రేక చిత్తవృత్తియు, శివమును మూల కారణము లని చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు.

కల్యాణి పట్టణము అత్యంత వైభవశాలిగా నున్నట్లు సువిశాలమయి, జనాకీర్ణమయి, మహోన్నత సౌధములకును, రాజ ప్రాసాదములకును, గగనచుంబిత భవనములకును, సుందరోద్యానములకును ఆలవాలమయి యుండెడిది యనుటకు సందేహము లేదు. ఇప్పుడు వాటిజాడ యేమియు కనబడవు. శిథిలావశేషములగు నిరాకారపు మట్టిదిబ్బలు ఇప్పుడు మనకు ఎల్లయెడ నేత్రగోచరమయి, వైభవ సంపన్నమయి ప్రకాశించిన ఆ చాళుక్య రాజధాని పూర్వవైభవమును స్ఫురింప జేయుచుండును.

చీనా దేశపు బౌద్ధ యాత్రికుడగు హ్యూయనుత్సాంగు వ్రాతలవలన పురాతన సంస్కృతి కొంతవరకు గోచరమగుచున్నది.

ఇచ్చటి భూసారము ఫలవంతమైనట్టిది. ఇచ్చట ధాన్యాదులు పుష్కలముగా పండుచుండెను. ఇచ్చట వాతావరణము సమశీతోష్ణముగా నుండెను. సత్సంప్రదాయములు ప్రచారములో నుండెను.

లిచ్ఛవిజనులు దీర్ఘకాయులు. పౌరుషవంతులు. ఎట్టి అవమానమునుగూడ సహించెడివారు కారు. శరణుజొచ్చిన వారిని రక్షించుటకు వెనుదీసెడివారు కారు. తమకు ద్రోహము చేసినవారియెడ ప్రతీకారచర్య తీసికొనదలచినచో, తమ శత్రువునకు ముందు తెలుపకుండ నుండెడివారు కారు. రాజుగారి కొలువులో వందలకొలది శూరభటు లుండెడివారు. వారు యుద్ధమునకు బోవునప్పుడు మత్తుపదార్థములను బాగుగ సేవించెడివారు. అట్టిస్థితిలో నున్నవాడు ఒక్కొక్క బల్లెమును మాత్రము కేలధరించి పదివేలమంది శత్రువులను ఎదిరింపగలుగుచుండెను. ఇట్టి భటసమూహమును చూచుకొని రాజు గర్వించుచుండెను. సేనానాయకు డెవడయిన యుద్ధమునందోడిపోయినచో వానికి దేహదండన విధించుటకు మారుగా వాడు ఆడుదానివలె చీరను, రవికను ధరించునట్లు చేసెడివారు. అట్టి అవమానమును భరించలేక వాడే ప్రాణములను త్యజించు స్థితికి తెచ్చుచుండెడివారు.

లిచ్ఛవిజనులు విద్యాప్రియులుగా నుండిరి. నూరారు మఠము లుండెను. వీటిలో సుమారు అయిదువేలమంది [illegible] లుండుచుండిరి. వందలకొలది దేవాయతనము లుండెను. వివిధ మతప్రాసంగికుల కావాసమయి యుండెను. నగరము లోపలను, వెలుపలను పెక్కు దివ్యస్తూపములు విలసిల్లియుండెను. వీని యన్నిటియందును గడచిన నలుగురు బోధిసత్త్వులు అధిష్ఠించి తమ పాదచిహ్నములను నిలిపియుండిరి. ఈ దివ్యస్తూపములను అశోకవర్ధన మహారాజు

శ్రీః

# కొండాపుర కథనము.

కాలపురుషుని ప్రభావముచేత భూగర్భమున మట్టి మాయమైయున్న ఆంధ్రనగరము లెన్నియో ఈ హైదరాబాదు రాష్ట్రములో కలవు. అట్టి ఆంధ్రనగరములలో నొక్కటి యగు నట్టిది కొండాపురము. ఈ కొండాపురమను ప్రాచీన పట్టణముయొక్క యునికి మొన మొన్నటి వరకు భారతీయ చరిత్రకారులు కనివిని యెరుంగని నూతన చరిత్రాంశము.

ఈ కొండాపురము ఇప్పుడొక చిన్న గ్రామముగా నున్నను, దాని ప్రాంతమునం దత్యంత ప్రాచీనకాలమున ననగా రెండువేల సంవత్సరముల క్రిందట నొక ఆంధ్ర రాజధానీ నగరము విలసిల్లి, వైభవోపేతమై యుండెననుట ఆంధ్రులకును, చరిత్రకారులకును మహదానందావహమగు విషయముగదా!

కొండాపురము హైదరాబాదునకు ౪౩ మైళ్ళ దూరమున బిదరునకు పోవు రాచబాటసమీపమున మెదకుజిల్లాలో నున్నది. ఇదియొక చరిత్ర ప్రాధాన్యముకల స్థలమని కనుగొన్నవిధ మొక అకస్మాత్సంఘటనము. కొండాపురము కాపురస్థుడు సయ్యదు హుసేను అను పేరుగలవాడు ఆర్ష

ప్రోత్సాహకరముగా నుండుటచే, ఇక దాని యంతము తెలిసి కొనవలయునని కృతనిశ్చయులై పని చేయసాగిరి. రెండు మాసములలోపలనె త్రవ్వగనే ఇట్టి శిథిలాలు కనబడెను. ఇంకను త్రవ్వుచుపోగా ఇటుకలతోను, మట్టితోను కట్టిన గోడలు, రాతి కాలువలు, కమ్మరికొలిములు, పెద్ద పెద్ద మట్టిగాబులు, స్తూపములు, చైత్యములు, విహారములు కనబడినవి. ఇంకను భాండములు, విగ్రహములు, పూసలు, సొమ్ములు నాణెములు దొరికినవి. వీటిని పరిశోధించగా ఇదియొక పట్టణముగా నుండెననియు, వర్తకస్థానముగా విలసిల్లియుండెననియు వివిధ వృత్తులుగల కర్మకారులకు నిలయమయి పరిశ్రమల కేంద్రముగా నొప్పుచుండెననియు, ప్రజలు బౌద్ధమతావలంబు లనియు స్పష్టముగా తేలినది.

ఇచ్చట కుమ్మరులు, కమ్మరులు, కంసాలులు, ఉప్పరులు, వడ్రంగులు, మొదలగువారును, వివిధకళలయందారి తేరినవారును, భాగ్యవంతులును, బీదలును నివసించుచుండిరి. ప్రజల ధార్మిక విశ్వాసములు, వస్త్రాద్యలంకారములు, నాగరకతాదులు ఎట్టివిగానుండెనో అచ్చట దొరకిన వస్తుజాలమునుబట్టి యూహించుట కవకాశము కలుగుచుండెను.

ఇచ్చటి కుమ్మరి సామాన్యుడా? కాడు. చిత్రకళను, శిల్పకళను మేళవించిన ప్రతిభాశాలి. ఇతడు భాండములనేగాక గాజులు, సొమ్ములుకూడ చేయుచుండెడివాడు. ఈతని భాండములు చిన్నవి, పెద్దవి పెక్కురకములుగాలు

కథాభాగములను దెలుపునట్టివిగా నున్నవి. ఈ విగ్రహముల తలలపయి వివిధములయిన శిరోవేష్టములుగలవు. బౌద్ధమతమునకు సంబంధించిన పద్మము, ధర్మ చక్రములు అందచందములతో నొప్పారుచుండెడివి కలవు. ఇవి అమరావతి శిల్పమును బోలియున్నవి.

సాధారణముగా చిత్రకారుడు సమకాలమువారి హావభావములను, వేషములను చిత్రించుట సహజము. ఈయూహ సరియైనచో ఆర్యజాతినిగాక ద్రావిడజాత్యులను బోలిన ఆవిగ్రహాలను బట్టి యానాటి ప్రజల రూపములను గ్రహింపగలుగుదుము. వారు తలలపై వివిధములయిన పాగాలు చిత్ర విచిత్రముగా ధరించుచుండిరి. మెడలో హారములు వేసికొనుచుండిరి, చెవులకు పోగులు పెట్టుకొనుచుండిరి. వారి జుట్టు, కట్టు విధములు తెలియనగుచున్నవి. కొన్ని విగ్రహములు ఆత్మానందమును సూచించు మందహాస ముఖవిలసితములు. కొన్ని విగ్రహములు ఆత్మశాంతిని సూచించు ధ్యానమగ్నతా విలసితములు. అంతరంగిక భావములను వ్యక్తీకరించుటయందును, శిల్పకళా విన్యాసమును బయలుపరచుటయందును ఇవి యజంతా చిత్రముల శోభకు ఎంతమాత్రము తీసిపోవు. జంతువులలో సింహము, ఎద్దు, గుఱ్ఱము, గొఱ్ఱె విగ్రహములు దొరికినవి. ఒక స్త్రీ తన యొడిలో బిడ్డనుంచుకొని చేతిలో పిడిగల విసనకఱ్ఱనో ధర్మపాత్రమునో, ధూపమువేయు పాత్రనో పట్టుకొని యున్నది. కొన్ని స్త్రీ పురుష విగ్రహముల ఎడమచేతిపై రామచిలుకో, పావురమో

పండ్లుండియున్నది. విగ్రహము లన్నిటియందును జీవకళ యుట్టిపడుచుండును.

మానవసౌందర్యమును సాదృశ్యపడ హాస్యముకదా! ఈశిల్ప హాస్య విగ్రహములుగూడ కనబడుచున్నవి. శిల్పకారుని మట్టి విగ్రహములలో కొన్ని యీ విషయమును తెలియజే యుచున్నవి. ఆ పట్టణపు కార్యభావములు, ఆ లంబ కేశములు, ఆభరణములు, ఆ వస్త్రవిశేషములు మొదలగు వెంటనే సమ్మోహపరచి యున్నవి. ఆ తల కట్టుబడ్డలు, ఆ ముక్కుల సంపద, ఆ తలగడ్డలు అజంతా చిత్రములను తలపునకు తెచ్చుచుండును. ఇచ్చటి శిల్పకారకళ భారతఖండము నం దపూర్వమయి ఆ కళానాక్రమమున నూతనాధ్యాయమునకు శ్రీకారము చుట్టియున్నది!

ఇచ్చటి కమ్మరిదును గట్టివాడే. ఏడు ఇనుముతో చేసిన కొడవళ్లు, గొడ్డళ్లు, పలకాలూ, బాకులు, ఉలులు, మేకులు, నాగళ్ళు, మొదలగునవి దొరికినవి. వీటినిబట్టి యిచ్చటి వారు వ్యవసాయ వృత్తిగలవారయి యుండిరని తోచుచున్నది. బల్లెముల అగ్రములును దొరకుటచే ఇచ్చట బల్లెములు చేయుచుండిరనియు, ఆపట్టణమున సైన్యముండి యుండెననియు స్ఫురించుచున్నది. సైన్యముండు చోటు సామాన్య గ్రామముగా నుండదుకదా! కొలుములు, తిత్తులు, కాల్చిన పనిముట్లను చల్లార్చుటకు పెద్దపెద్ద నీళ్ళబానలు, కమ్మరంగళ్ళు ఎక్కువ సంఖ్యలో కనబడినందున కమ్మరిపని

అచ్చట భారీయెత్తుమీఁద సాగుచుండినట్లు మనము గ్రహింపవచ్చును.

ఇచ్చట దొరికిన రత్నసువర్ణ మయములగు సొమ్ములను భాగ్యవంతులు ధరించుచుండి యుండవచ్చును. వెండి, రాగి, దంతపు, ఆల్చిప్ప సొమ్ములను సామాన్యులు పెట్టుకొనుచుండిరని అనుకోవచ్చును. మరి బీదసాదల కొరకుగాబోలు మన కుంభకారుడు అందచందములతో సొమ్ములను సృష్టించి వారి ముద్దుముచ్చటలు తీర్చినాడు. జపమాలపూసలు, కంఠహారములు, కరకంకణములు లభ్యమానములుగా నున్నవి. రత్నాభరణములు, కృత్రిమ రత్నాభరణములు వివిధాకారములలో నున్నవి, కొన్ని కోలగానున్నవి, కొన్ని త్రికోణాకారముగలవి. కొన్ని అర్ధచంద్రాకృతి నున్నవి. దొరికిన వాటిలో మట్టిసొమ్ములే యెక్కువగానున్నవి. ఆవములో కాల్చి తీసిన మట్టిగాజులు, మట్టిహారములు, మట్టి తాయెతులు పేదవారు ధరించుటకే యుద్దేశింపబడినవి. తాయెతులు శృంగారమునకేగాక దయ్యాల పీడ వదిలించుకొనుటకును ఉపయోగించుకొనుచుండిరి. భాగ్యవంతులు బంగారు కాసుల దండలు వేసికొనుచుండగా పేదల తృప్తికయి మన కుంభకారుడు బంగారు కాసులయొక్క వన్నె, రూపు, నాణ్యము, అందచందములకు దీటువచ్చునట్టి మట్టి కాసులను సృష్టించినాడు. ఇట్టి మట్టి కాసులదండలు మెడలో వేసికొని బీదపడుచులు కులుకుచుండిరి కాబోలు. ఈమట్టి కాసులు క్రీస్తు శకపు మొదటి శతాబ్దపు రోమక నాణెములను

లుగా నుండిన మిస్టరు గులాం యెజ్దానిగారు అభిప్రాయ పడినారు. టంకసాలయుండు ప్రదేశము రాజధానీ పురమో, దానితో సదృశమగు పురమో అయియుండును. ఇందు శాతవాహన వంశజులయిన గౌతమీపుత్ర శాతకర్ణి, వసిష్ఠపుత్ర పులమావి, శివశ్రీ పులమావి, యజ్ఞశ్రీ శాతకర్ణి అను సమ్రాట్టులకు చెందిన వనినాలుగు నాణెములు స్పష్టపరచుచున్నవి. కొన్ని చతురాకారమగు సీసపు నాణెములు గలవు ఇట్టివి యితః పూర్వము ప్రకటితము కాలేదు. ఇవియు శాతవాహనులవే. ఇచ్చట దొరకిన వెండినాణెములనుబట్టి శాతవాహనులకు వెండి నాణెములుకూడ నుండెనను క్రొత్త విషయము తెలిసినది. కొన్ని రాజముద్రికలుకూడ దొరకినవి. అందలి యక్షరముల స్వరూపమునుబట్టి అవి క్రీస్తుశకము మొదటి శతాబ్దమునాటివి. అనగా సుమారు రెండువేల సంవత్సరముల క్రిందటివి.

కొండాపురము భూగర్భములోని గృహనిర్మాణ విధానము. నిరాడంబరముగా నున్నను వాస్తుశాస్త్రజ్ఞుల శిల్పకళా వైదుష్యమును ప్రస్ఫుటము చేయుచున్నవి. సవేశన గృహముల కేమి, దేవమందిరముల కేమి వివిధ పరిమాణములుగల యిటుకలు వాడబడినవి. ఈయిటుకలను చెరువులోని బంకమట్టితో చేసియుండిరి ప్రాకారకుడ్యములకు ఉపయోగించిన యిటుకలు ౨౩ అంగుళముల పొడవు. ౧౨ అంగుళముల వెడల్పు ౨౪ అంగుళముల మందము గలిగి యున్నవి. వలయాకారముగ నుండెడు స్తూపములకును, చైత్యములకును వాడిన యిటుకల మూలలు వంపులుగా

నుండి సరిచేయవలసిన అవసరములేకుండ ఒప్పియున్నవి. ఈ యిటుకలు ౨,౧౦౦ సంవత్సరములనుండి చెక్కు చెదరకుండ నుండుట ఎంత గమనింపదగిన విషయమో చూచితిరా! వాటి పక్కలు నునుపుగానుండి పేర్చి పెట్టినప్పుడు అంద ముగా కనబడుచుండును. ఇంట్లపైన పెంకులు గప్పుచుండిరి. నేలకు గచ్చు చేయుచుండిరి.

ఇచ్చట మూడు విహారములు, రెండు చైత్యములు, మూడు స్తూపములు, ఒక 'దాగోబా' ఇప్పటివరకు కనబడి నవి. దాగోబా యనునది ధాతుగర్భము. ధాతుగర్భమనగా బుద్ధదేవునిదంతమో, అస్థికలో సమాధిచేసిన ఆలయము. ఒక విహారములో ౭ గదులు కలవు. ౩:౪ గదులమధ్య ౪ అడుగుల ౨ అంగుళముల వెడల్పుగల త్రోవకలదు. ప్రతి గది ౧౦ చదరపు అడుగులున్నది. బౌద్ధభిక్షువుల నివా సార్థము మూలలయందు కొట్టికలు గలవు.

ఈ విహారమునకు దక్షిణముగా రెండు చైత్యములు కలవు. అందొకదాని లోపలిభాగము ౨౪ అడుగుల ౭ అంగుళముల పొడవు. ౧౦ అడుగుల ౫ అంగుళముల వెడల్పు కలది. మరొక చైత్యము ౨౧ అడుగుల ౭ అంగుళముల పొడవు, ౧౨ అడుగుల వెడల్పు కలిగియున్నది. ఒక స్తూపము ప్రాకారాంగణములో నున్నది. మరియొక స్తూపముయొక్క ఆవర్తపు అడ్డుకొలత ౧౯ అడుగులున్నది. దేవమందిరములు కొన్నియున్నవి గాని అవి చాల చెడి పోయియున్నవి. ఏవంవిధ విషయములను బట్టి ఆ నగర

వాసులు బౌద్ధమతమునందు గాఢభక్తి కలవారయి యుండిరని తెలుచున్నది. ఇచ్చట బుద్ధదేవుని ప్రతిమయొక్కటియు దొరకకుండుటచే ప్రజలు హీనాయన సాంప్రదాయమును చెందిన బౌద్ధులయి యుండియుండురవి తలంపవలసి యున్నది.

ప్రతి గృహమునకును, ప్రతి అంగడికిని ఒకటో రెండో చక్కగా కట్టబడిన నేలమాళిగలు కనబడుచుండుట చోద్యముగా నుండగలదు. ఇట్టి నేలమాళిగలు అధికసంఖ్యలో నున్నవి. వీటిలోనే వివిధ నాణెములు, అచ్చుదిమ్మెలు, పవిత్రవిగ్రహాలు, అమూల్యాభరణాలు, పూసలపేర్లు మొదలగునవి దొరకినవి. వాటి నమూల్యాముగా భావించి భద్రముగా నచ్చట గుప్తపరచి యుండనోపు

ఇంతవరకు చేసిన వర్ణనాంశములనుబట్టి కొండాపుర ప్రాంతమందలి శిథిలనగరము రెండు వేల సంవత్సరముల క్రిందట విశిష్ట సభ్యత కలదియయి క్రీ. పూ ౨౦౦ ల నుండి క్రీ. శ. ౨౦౦ ల వరకు అనగా ౪౦౦ సంవత్సరములు సకల సంపద్వైభవములతో జనాకీర్ణమయి విరాజిల్లి యున్నట్లు చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు. శాతవాహన రాజన్యులు ప్రతిష్ఠానము (పైఠన్)లో రాజ్యము చేయుచుండినప్పుడు వారికి ప్రాకార పరిఖాపరివృతములగు ముప్పది నగరములుండెనని ఆ కాలమునాటి పాశ్చాత్యులు వ్రాసియున్నారు. ఆ ముప్పదింటిలో నీ కొండాపురమొక మేలిపురమయి యుండవచ్చునని అనుకొనుచున్నారు. ఉత్తరభారతమునందు

తక్షశిలానగరమునకు గల ప్రాముఖ్యము దక్షిణాపథమున నీ కొండాపురమునకు గలదని ఇండియా గవర్నమెంటు ఆర్ష శాఖాధిపతి రావుబహద్దరు కే. యన్. దీక్షితులుగారు వచించియున్నారు. ఇంక నీ కొండాపురపు మహత్తు ఎంత గొప్పదో మీరే యూహించండి. ఇంకొక అద్భుత సారాంశ మేమనగా, బిదరు ప్రాంతమే ప్రాచీన విదర్భ దేశమను ఊహ సరియైనచో, ఈ కొండాపురము శ్రీకృష్ణుని అగ్రమహిషి రుక్మిణీదేవి జన్మస్థలమగు కుండినపురమయి ఉండియుండు ననుటకు అవకాశము కలుగుచున్నది.

ఈ నగరము శిథిలపుజాడలు క్రీ. శ. రెండవ శతాబ్దాంతమువరకే కనబడుచున్నవి. కావున ఆకాలమందే అది నాశన మయియుండును. ఇది ఎట్లు నాశనమయినదో తెలియదు. భూకంపమువల్లనో, శత్రువుల దాడిఫలితముగానో, బౌద్ధమత క్షీణపరిణామముననో ఈ చక్కని ఆంధ్రనగరము నాశముపాలయి యుండును. ఎట్లయిననేమి? కాలపురుషుడు తన ప్రభావమును జూపియున్నాడు. మన ఆర్ష శాఖవారి పుణ్యాన, ముఖ్యముగా శ్రీ ఖ్వాజా మొహమ్మదు అహమదు సాహేబుగారి సముచిత శ్రద్ధాభిమాన నైపుణ్యముల పర్యవసానముగ కొండాపుర వైభవోదంతమును వినగలుగు భాగ్యము ఆంధ్రులకు లభించినది.



౫.

# కొలనుపాక కథనము.

కొలనుపాక పురము నల్లగొండ జిల్లాలో నున్న పురాతన పట్టణము. ఆంధ్రదేశములో ప్రాభవము గోల్పోయిన మహాపట్టణములలో నిది యొకటియై యున్నది. ఇది ఇప్పుడు నవాబు బహిరామద్దౌలా బహదూరు వారి జాగీరులోని చిన్నగ్రామము. దక్షిణాపథములో రాజకీయముగను, మతవిషయకముగను గొప్ప కేంద్రస్థానముగా నుండి ప్రసిద్ధికెక్కి యుండెననుటకు అచ్చట నిప్పుడు దృగ్గోచరమగు శాసనములు, శిల్పచిహ్నములు ప్రబల తార్కాణముగా నుండగలవు.

ఈ పట్టణము కొలిపాక, కుల్పాక, కొట్టియపాక, కొళ్ళియపాక, కొట్టిపాక, కొల్లిపాకె అను పేర్లతో శాసనములందు గనబడుచున్నది. ఇవిగాక బింబావతిపురి, వ్యాఖ్యానగరము, సరోవర కుటీరము, సోమశేఖరపురము, కుదుటపురి, కుళువపురము అను నామములతోకూడ ఇది వ్యవహరింపబడు చుండినట్లు స్థలపురాణాదులు తెలుపుచున్నవి. కొలనుపాక అనునదియే వ్యవహారములో నున్నది. కొలిపాక మహాత్మ్యమను కావ్యమును గలదు.

ప్రచండదండ నాయకుడు, విబుధవరనాయకుడు; సుజనప్రసన్నుడు, గోత్రపవిత్రుడు, వరాంగనాపుత్రుడు తురగరేవంతుడు, వైరి కృతాంతుడు, సాహసోత్తుంగుడు నామాది సమస్తప్రశస్తిసహితుడయి ప్రఖ్యాతికెక్కియుండెను. శ్రీమహామండలేశ్వర శ్రీసోమేశ్వర దేవభూతి కొలిపాకలో రాజ్యము చేయుచుండినట్లు క్రీ. శ. ౧౧౧౦, ౧౧౯౬ తారీఖులుగల శాసనములు తెలుపుచున్నవి. ఈ సోమేశ్వర దేవుడు చాళుక్యగంగ పెర్మాడి అను నామాంతరముగల యారనవిక్రమాదిత్యుని రెండవ కుమారుడు కుమారసోమేశ్వరుడని ఒక శాసనములో ముద్దుగా పేర్కొనబడినాడు. ఇతడే భూలోకమల మూడవసోమేశ్వరుడని ప్రసిద్ధికెక్కెను.

రెండవ జగదేక మల్లుని ప్రధానియు, అంతఃపురాధ్యక్షుడును, కరితురగ పట్టసాహిణియు, శ్రీకరణుడును, సర్వాధ్యక్షుడును, సేనాపతియు, హెంజలాల సంధివిగ్రహియు నగు కేశిమయ్య యనదినాడు మిర్తినాడు, కోసగినాడు, గావిదిరాలనాడు, కళ్ళకెలగునాడు, సిందవాడినాడు, కొల్లిహాకనాడు మొదలగునాడులను పరిపాలించుచుండినట్లు గురజాల శాసనమువల్ల తెలియుచున్నది. ఇందలి కొల్లిహాకెనాడనునది మన కొల్లిపాకనాడె. కాబట్టి క్రీ. శ. ౧౧౮౩ నాటికి కొలనుపాక రాజ్యము పశ్చిమ చాళుక్య చక్రవర్తుల పరిపాలనము క్రిందనే యుండెనని స్పష్టమగుచున్నది.

చాళుక్యుల తరువాత ఈ కొలనుపాకపురము కాకతీయాంధ్రసామ్రాజ్యభాగముగా విరాజిల్లినట్లు తోచుచున్నది.

త్రిభువన మల్లదేవరాజు అనువాడు త్రిభువన మల్ల బేతరాజు. ఇతడు కాకతి ప్రోలరాజు కుమారుడు. రెండవ బేతరాజని, చరిత్రలో గణింపబడినాడు. ఇతడు ౧౦౬౦, ౧౧౧౫ వరకు రాజ్యము నేలియుండెను. త్రిభువన మల్ల దేవుడు తన శాసనములో చాళుక్య చక్రవర్తిని చాళుక్య విక్రమశకమును పేర్కొనుటచే సామంతుడుగా నుండెనని తోచుచున్నది.

ప్రతాపరుద్ర మహారాజులుంగారు ఓరుగల్లు రాజధానిలో రాజ్యము చేయుచుండగా, రాష్ట్రకూట వంశాలంకారుడొకడు నగరావతంసమగు కొల్లిపాకలో రాజ్యము చేయుచుండెనని ఒక శాసనము తెలుపుచున్నది. ఇతడు ఏప్రతాపరుద్రుడో తెలియుటలేదు. మొదటి ప్రతాపరుద్రుడు ౧౧౮౦ నుండి ౧౧౯౨ వరకు రాజ్యమేలియుండెను. రెండవ ప్రతాపరుద్రుడు ౧౨౯౫ నుండి ౧౩౨౫ వరకు రాజ్యమేలియుండెను. క్రీ. శ. ౧౨౬౦ మొదలు ౧౨౯౮ వరకు రాజ్యమేలిన శ్రీరాణీ రుద్రమదేవి శ్రీ గణపతిదేవుని కూతురనియు, ఈమె భర్త వీరభద్రుడనియు కొలనుపాకలోని యొక శాసనము తెలుపుచున్నది. ఈ శాసనాధారములనుబట్టి పదునొకండవ శతాబ్దమునుండి పదునాల్గవ శతాబ్దమువరకు కొంతకొంత వరకు కొలనుపాక చరిత్ర కథనము తెలియనగుచున్నది.

కొలనుపాక రాజ్యము ౭౦౦౦ గ్రామములసీమగా నుండెను. ఈ నగరావతంసము పంచక్రోశపరిమిత పట్టణ

మయి యుండెను. ఏతత్ప్రాంత పరిసర గ్రామములు సారవంతములు లయి, సస్యశ్యామలములగుటచే, ఇతరత్ర, అను ఆర్థిక వ్యాప్తిపై ప్రభావమున జరుగుచు గొప్ప వాణిజ్యకేంద్ర ములనంత మయి వొప్పుచుండెను.

ధార్మిక పరిణామములలో నీ నగరము ప్రముఖకేంద్రముగా ప్రభాసించినది. ఇది శైవమత కేంద్రస్థానముగా నుండి 'దక్షిణ కాశి' అను గౌరవ నామమును బొందెను. ఇచ్చట "కాశీ బుగ్గ" అను నడబావి గలదు. దానిప్రక్క నొక చిన్న శివాలయమును గలదు. బావిలోనీరు అనవరత గంగోదక మనియు, గుడిలోని దేవుడు అపర విశ్వేశ్వరుడనియు ఖ్యాతి వహించి యున్నవి. కావుననే కొలనుపాక దక్షిణ కాశి అయినది. శైవ మతముతో పాటు జైనమతముగూడ ఇచ్చట ప్రవర్ధమానముగా నుండెను. ఇట్లు వేర్వేరు మతములు సమరస భావముతో మెలగుచుండుట ఆ కాలపు రాజుల రాజనీతికి, మతసహనశీలతకును ద్యోతకము కాగలదు.

ఈ మతముల ప్రాబల్యమును, వైభవమును జాటునవి ఇచ్చట నిర్మితమయిన దేవాలయ పరంపర. ప్రారంభదినము లలో నిచ్చట లెక్కలేనన్ని దేవాలయములుండి యుండు ననుటకు సందేహము లేదు. అన్నియు నాశన దేవతల పాలయి నవి. కీర్తిస్తంభాలు, సాలంకాలు, నందులు, లింగములు, సప్తమాతల విగ్రహాలు మొదలగునవి శిథిల రూపములతో విచ్చలవిడిగా పడియుండి దేవాలయముల సంఖ్యను, ఘనతను చాలవరకు చాటుచున్నవి.

ఎత్తును, ౩ అడుగుల ౧౧ అంగుళముల కైవారమును కలిగి యున్నది. ఈ లింగముపై గొలుసువలె సమాన పరిమాణము గలిగి సరిగా ౧౦౦౦ చిన్న లింగములుండుట ఒక విశేషము. పంచక్రోశ పరిమితమగు నీ పట్టణమున కోటిలింగ ప్రతిష్ఠను సల్పుచు తక్కువ లింగములతో నీలింగమును ప్రతిష్ఠించిరని తెలుపుచున్నారు.

సోమేశ్వరగుడికి ఉత్తరదిశలో ప్రతాపరుద్రు గుడి యని పిలువబడు నాలయముగలదు. హనుమకొండలోని ఆలయ శిల్పమును ఈ గుడి శిల్పము పోలియున్నది. ఈ పురమును ప్రతాపరుద్రుడేలినట్లు శాసన దృష్టాంతములు కలవు కదా! ఇది ఆనరపాలుని పేర అంకితమయి యుండి యుండునేమో యను నూహ జనించుచున్నది.

వీరనారాయణగుడి గ్రామమధ్యమున నున్నది. ఇందలి విశేషమేమన. సాధారణముగా విష్ణ్వాలయము తూర్పు ద్వారములు కలిగియుండుట సాంప్రదాయమయి యుండగా దీనిసింహద్వారము పశ్చిమముఖముగా నున్నది. ఏలకో?

ఈ గ్రామములో నొక దిబ్బపయి ౧౮–౨౦ అడుగుల ఎత్తుగల పెద్ద ద్వారమొకటికలదు. ఇచ్చటనే అయిదారడుగులు నిడివిగల పాదములు మూడొక బండపై నున్నవి. ఇది యొక విగ్రహమునుండి విరుగగొట్టినటుల దోచుచున్నది. అట్లేయైన ఆవిగ్రహ మెంతగొప్పదిగా నుండి యుండునో? ఆవిగ్రహ మేమయినదో?

జైనమందిరములో మూడుగుళ్ళుగలవు. ఈ మూడును తూర్పు ముఖము కలిగియున్నవి. ముఖ్యమయిన గుడి మధ్య నున్నది. గోపురములతో శిఖరాలతో చిత్రాలంకారమయి యున్నది. జైనులకు కొలనుపాక పవిత్రమైన ముఖ్య క్షేత్రము.

హిందూ దేవాలయములు చాళుక్యశిల్పమును జాటుచు న్నవి. ఇచ్చట నుపయోగించిన ఇటుకలు పదినైదున్నర అంగుళముల పొడవు ఎనిమిదిన్నర అంగుళములు వెడల్పు ౨ అంగుళముల మందముగలవు. ఈ ఆకారము మౌర్యుల కాలమునాటి, గుప్తకాలమునాటి ఇటుకలతో దాదాపు పోలియున్నది. కాబట్టి ఇటుకల ఆకారమును బట్టి ఇవి బహు పురాతనమైన వని యూహించుటకు నవకాశము కలుగు చున్నది.

కొలనుపాక ఇప్పుడు చిగ్రామముగా నున్నను ఎన్నో శతాబ్దములకు పూర్వము రాజధాని నామగౌరవమును పొందియుండెననియు, ఈ రాజ్యములో 2000 ల గ్రామము లుండినవనియు వెల్లడియగుచున్నది. చాళుక్య చక్రవర్తుల ప్రధానులో దండనాయకులో ఇచ్చటనుండి రాజ్యపాలనము గావించుచుండిరి. ఒకసారి చక్రవర్తికుమారుడే రాచరికము నడుపు గౌరవమును కొలనుపాక కలిగియుండెను. చాళుక్యుల ప్రతిభ తగ్గినతరువాత కాకతీయ సామ్రాజ్యము ప్రబలెను. అప్పుడిది కాకతీయ సామంత పాలకులచే పాలింపబడెను. తరువాత కొన్ని శతాబ్దములవరకు నేమియు తెలియదు.

# గోలకొండ శిథిలములు

గోలకొండదుర్గమును చూచు వెనగానే నిజాంరాష్ట్రీయులకు హార్దవిషాదములు ప్రబలిపోవును. ఈ దుర్గము రెండు వందలయేబది సంవత్సరముల క్రిందటివరకు కుతుబుషాహుల శత్రుభయంకరమయి గంభీరాకారములో నిలుచుండెను. ఈ దుర్గమునందు రాజప్రాసాదములు, విపణివీథులు, సుందరోద్యానములు విలసిల్లియుండెను. ఇది మేటి పట్టణముగా ప్రసిద్ధి చెందియుండెను. గోలకొండ పట్టణములో వర్తకపుంగవులు విదేశములతో వర్తకము చేయుచు కుబేర సమానులయియుండిరి. అప్పటి పట్టణములో దొరకని వస్తువే లేకుండెను. అత్యంత వైభవసంపన్నమయి, నాగరికతా విలాసములతో నొప్పారుచు, మహోన్నతశిఖరము నధిరోహించిన ఈ నగరరాజము యొక్క మంచి దినములు తలంచుకొనినప్పుడు ఏ సహృదయుడు హర్షపులకాంకితుడు గాకుండనుండగలడు? ఇప్పుడో వైభవమును, అధికారమును, కళావిన్యాసములను, సమస్త శోభన చిహ్నములను గోల్పోయి, నిర్వికారమయి పాడుపడి యున్న యీ దుర్గరాజము ఎట్టివానినికూడ విషాదసంభరితునిగా చేయకుండ నుండునా

గోలకొండ పట్టణము తెలంగాణమునకు తలమానికము గానుండెను. ఇచ్చట ఆంధ్రమంత్రులు తమ రాజనీతి ధురం

ధరత కనంబరచి రాజ్యచక్రమును నిరపాయముగా నడిపిరి. ఇచ్చట ఆంధ్రకవులు తమ కవితాగానము చేసి శ్రోతల నానందింపజేసిరి. ఇచ్చట నాంధ్ర భక్తులు తమపాదస్పర్శ చేసి పవిత్రముగావించిరి. ఆంధ్రభూమి గర్భస్థమణి "గోలకొండ వజ్రము"గా ప్రసిద్ధికెక్కెను. ఆంధ్రులచే నిర్మితమయి, ఆంధ్రులసలహా సహాయముల ప్రకారము సంస్కరింపబడినదయి, చివరకు ఆంధ్రుల యదృష్ట రేఖలను తారుమారు చేసిన దీగోలకొండ పట్టణమే గోలకొండ పట్టణమునకును, ఆంధ్రులకును అవినాభావ సంబంధము కలదు.

గోలకొండ దుర్గము ఎప్పుడు నిర్మితమయినదో సరియైన చరిత్రాంశములులేవు. ఒకానొక ఆంధ్రరాజన్యుడు చిన్న మట్టికోటను కట్టియుండెనని తెలియుచున్నది. ఈ కోటను ఓరుగల్లు రాజగు కన్నయ్యనాయకు డనువాడు క్రీ. శ. ౧౩౬౪ లో బహామనీ నవాబుల వశముచేసెను. బహామనీ రాజ్యపు సుబేదారుగా ౧౫౧౮ లో నీప్రాంతమందుండి స్వాతంత్ర్యము ప్రకటించిన సుల్తాన్ కులీ కుతుబుషాహాకు ఇది వశమయ్యెను (౧౫౨౨) కుతుబుషాహీలలో నైదవవాడగు మహామ్మదుకులీ కుతుబుషాహా తన భోగకాంతపేర భాగానగరమును (భాగ్యనగరమును) మూసీనదీ తటమున క్రీ. శ ౧౫౯౧ లో కట్టించెను. అప్పటినుండి గోలకొండ ప్రాధాన్యము తగ్గసాగెను. కుతుబుషాహీ వంశములో ఏడవవాడగు అబుల్ హాసన్ తానీషా ౧౬౮౭ లో పదభ్రష్టుడయి, ఔరంగజేబు చేత చెరపెట్టబడగనే గోలకొండ దుర్గము దుర్గతి

చెందెను. తరువాత నీదుర్గము మొగలు చక్రవర్తి ప్రతినిధిగా నిచ్చటికి వచ్చి స్వతంత్రుడయిన అసఫ్‌జాహా నిజాముల్ ముల్కు స్వాధీనమయ్యెను. ఇప్పుడు అసఫ్‌జాహీ వంశీయులగు హైదరాబాదు నిజాము ప్రభువుల పాలనలో నున్నది. ఈ చరిత్రాంశములనుబట్టి గోలకొండ దుర్గగర్భములో సుమారు ఆరువందల సంవత్సరముల చరిత్ర దాగియున్నట్లు స్పష్టమగుచున్నది.

మల్లన్న మఠము కట్టి కొలుపు చేయుచు నుండిన పీఠాధిపతులయిన గొల్లమహనీయులకు గోలకొండదుర్గ నిర్మాణముతో సంబంధమున్నట్లు లిఖిత దృష్టాంతములు కనబడుచున్నవి. హిందూరాజు కోటకట్టినప్పుడు గొల్లని సహాయముండెనో లేదో కాని తరువాత నీదుర్గమును విశాలపరచి, బలిష్ఠపరచి దుర్భేద్యమొనరించిన కుతుబుషాహావంశములో మొదటివాడగు సుల్తాన్ కులీకుతుబుషాహాకును, (౧౫౧౮–౧౫౪౩), ఏడవ సుల్తానగు అబ్దుల్లా కుతుబుషాకును (౧౬౨౬–౧౬౭౨) గొల్లవారి సహకారమున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది.

గోలకొండ ప్రాంతమునకు వెనుకటి కాలములో "మానుగల్లు" అను పేరుండెను. హిందూరాజు కట్టిన కోటకు "మానుగల్లుకోట" యనియే పేరుండెను. ఈ పేరును మార్చి "గోలకొండ" అని పేరు పెట్టినవాడు కుతుబుషాహీ వంశ మూలపురుషుడగు సుల్తాన్ కులీ కుతుబుషాహాయే. ఈ నూతన నామకరణోదంతమును ఎం. డి. తేవనాట్ అను పాశ్చాత్య బాటసారి ౧౬౬౭ లో ఇట్లు వివరించియున్నాడు :—

"రాజుగారుండే కొలువు దీర్చేడికోటకు... గోలకొండయని పేరు. రాజ్యమునకును ఇదియే పేరుకలదు. ప్రథమకుతుబుషాహా దానికా పేరు పెట్టెను. కారణమే మనగా తాను స్వతంత్రుడయిన తరువాత బలమయిన దుర్గము నొకదానిని కట్టవలయునని యోగ్యప్రదేశమును వెదకుచుండగా ఇప్పుడు కోటయున్న ప్రదేశమును ఒక గొల్లవాడు తెలిపియుండెను. ఈ గొల్లవాడు ఆయనను అరణ్యముగుండ నొక గుట్టవద్దకు గొంపోయెను. ఇచ్చటనే యిప్పుడు రాజప్రాసాదమున్నది. తన మనో వాంఛితమునకు ఆ ప్రదేశము చాల యోగ్యమయినదిగా కనబడినందున అచ్చటనే కోట కట్టి దానికి గోలకొండయని పేరుపెట్టెను. గోల్లాన్ అనగా తెలంగిభాషలో గొల్ల అని యర్థము."

తేవనాట్ చెప్పిన పైకథనమునుబట్టి ఈ దుర్గమునకును గొల్లవానికిగల సంబంధము విశదమగుచున్నది. తరువాతి కథాంశములనుబట్టి యూహించినచో ఆ గొల్లవాని కోరిక ప్రకారము సుల్తాన్ కులీ కుతుబుషాహా "గొల్లకొండ" అని పేరు పెట్టి యుండవచ్చును. గొల్లకొండయే అపభ్రంశమయి గోలకొండగా మారియుండుననుట నిక్కము. గోలకొండ నామకరణము క్రీ. శ. ౧౫౦౭ ప్రాంతములో జరిగి యుండవచ్చును.

ఈ గొల్లవాడు సామాన్యుడుకాక మహాత్ముడని మనము భావించవలసియున్నది. ఈ విషయము ముందు వచ్చెడు కథనము వలన స్పష్టము కాగలదు. ఇట్టి మహాత్మున కిచ్చిన మాటను తప్పి కులీకుతుబుషాహ గోలకొండను మహమ్మదు నగరు అను క్రొత్తపేరు ప్రకటించినాడు. ఆ పేరు అంతగా నిలువకపోయినను అపచారమేమో జరిగిపోయినది. ఏతదపచార ఫలితమో ఏమో కాని సుల్తాను కులీకుతుబుషా గోలకొండలోని మసీదులో వంగి నమాజు చేయుచుండగా మహమూదను జెంషెద్ కులీకుతుబుషాహ ప్రోత్సాహమున దుర్గపాలకునిచే వధింపబడినాడు. (౧౫౪౩).

క్రీస్తుశకము ౧౬౨౬ మొదలుకొని ౧౬౭౨ వరకును రాజ్యముచేసిన అబ్దుల్లా కుతుబుషాహ కాలములో ఈ దుర్గనిర్మాణమునకు గొల్లవాని సహకారము లభించియుండెను. ఈ విషయము ధనగరు కొండయ్యకు అబ్దుల్లా కుతుబుషాహ సమ్మతమున వ్రాసియిచ్చిన మొహరు దస్తఖతు, సనదు ఫర్మానా ప్రబల దృష్టాంతము.* ఈ సనదులో నూతనములు అద్భుతములునైన చరిత్రాంశములు గలవు ప్రామాణికమయినదిగానున్నది. గోలకొండకు మానుగల్లు

* ఈ సనదు ఇప్పుడు ధనగరు కొండయ్య వంశీయుడగు ముద్దమల్లయ్యగారి యొద్ద నున్నది దీనిని వెలికి తీసి తెలుగు పాఠమును పూర్తిగనిచ్చి, వ్యాఖ్యానము చేసి, ప్రకటించిన కీ॥శే॥ శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారికి చెందవలసియున్నది. గోలకొండ పత్రికయొక్క ౧౯౪౧ జనవరి ౯ ఫిబ్రవరి ౩, ఫిబ్రవరి ౨౭ తారీఖులుగల సంచికలను చూడుడు.

అను పేరుండెనని మొన్న మొన్నటివరకును ఎవరికిని తెలియకుండెను. ఈ సనదే ప్రప్రథమముగ ఆ విషయమును తెలిపినది.

కుతుబుషాహీ రాజ్యకాలములో హిందూస్థాన పరిస్థితులు అల్లకల్లోలముగానుండెను. యుద్ధస్థితి మెండుగానుండెను. అందుచే కుతుబుషాహీలు గోలకొండ కోటకు ఉత్తరము నందున్న సీసకమ్మల గుట్టలవద్ద కోటనుగట్టి గోలకొండ కోటకు కల్పుటకు సంకల్పించిరి. ౯౯౮ హిజ్రి (క్రీ.శ.౧౫౮౯) లో ఇబ్రహీం కుతుబుషాహా, ౧౦౨౯ హిజ్రి (క్రీ. శ ౧౬౧౯) లో మహమ్మదు కులీ కుతుబుషాహా, తరువాత అబ్దుల్లా కుతుబుషాహా దుర్గ నిర్మాణమునకు కడంగిరి. కాని వారి యీ ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. కులీ కుతుబుషాహా గొల్లవానియెడ గావించిన అపచారమే కారణమయి యుండునా? ఏమో! అబ్దుల్లాకుతుబుషాహా తన ప్రయత్నములన్నియు విఫలముకాగా నిరాశ చెంది తన ధార్మిక గురువయిన సయ్యదుషాహు ముస్తఫా సాహెబు కాదరీ గారితో చెప్పుకొనెను. అప్పుడా గురువర్యుని సలహాపరికారము ధనగరు కొండయ్యను పిలిపించుకొని వందనాది క్రియలచే పూజించి "మేము ఖిల్లా కట్టుటకు పులగంపోసి ప్రయత్నిస్తే కుదురలేదు. ఎందునిమిత్తార్థం? పూర్వం మీ పరంపర వారు భోనగిరిఖిల్లా, వరంగల్ ఖిల్లా కట్టియున్నారు. మీరు అదే సంతతి కాబట్టి ఇదికూడ మీవల్లనే కావలెను గాని ఇతరు ఎవరినుంచి కాదు" అని అడిగి చాలా మనవి చేసినాడట. అయితే యీ ధనగరు కొండయ్య యెవడు ?

యుండెను. ఈ వర్ణనాంశములనుబట్టి యీ ధనగరు కొండయ్య ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుడయి, యోగసిద్ధికలిగిన మహిమాన్వితుడయి యుండవలెను. ఇతడేకాక యీతని పూర్వీకులును అట్టి వారే యయియుండిరి. లేనిచో హిందూరాజగు ప్రతాపరుద్రుడును, మహమ్మదీయరాజగు అబ్దుల్లాకుతుబుషాహయును శృంగేరి మొదలగు పీఠాధిపతులును వీరినట్లు గౌరవించి యుందురా?

సుల్తాన్ అబ్దుల్లా చేసికొన్న ప్రార్థనకు కొండయ్య సమ్మతించి, ''అక్కడవిరు అడుగకమునుపే తాను చేసి యుంచిన యావత్తు కరామతు బయాను చేసి, దౌలతు చూయించి, సాధు గోకుల్ దాసు బావిలో పుతిలె అయియున్న కరామతు చెప్పి అసల మహత్తు అంతచూపించి, ఇదే కొండయ్య పేరుతోటి ఖరనామ సంవత్సర భాద్రపద శు. ౫ శుక్రవారము ౧౩ గడియల రాత్రికి పులుగంపోసినాడు. (౧౬౫౧) తర్వాత కిల్లాయావత్తు తయారు చేయించినాడు.'' ఈ కొండయ్యచూపిన దౌలతుతోటి కిల్లా తయారయినదట! ఈ కోటనే యిప్పుడు ''నయాఖిల్లా (కొత్తకోట) అనుచున్నారు. నయాఖిల్లా గోలకొండ కీశాన్యభాగపు కట్టడము. ౩౩౮౦ గజముల పొడవుగలిగి కీలక ప్రదేశమగు గుట్టను చుట్టుకొనియున్నది.

కోట నిర్మాణమునకు అవసరమగు ధనమును సమకూర్చిన యీ దౌలతునుగూర్చికూడ విచిత్రమయిన కథకలదు. ఆ కథను మనవి జేసెదను వినుండి.

గోకులదాసు అను పేరుగల ఒక సాధువు అరణ్యములో తపస్సు చేసికొనుచుండెను. ఆ యరణ్యములో మేకలను మేపుకొనుచున్న యొక గొల్లవాడు భక్తిభావముతో గోకులదాసుకు ప్రతిదినము పాలు సమర్పించుచు సేవించుచుండెను. ఆగొల్లవానికి తనయందు భక్తిభావము బాగుగా కుదిరినదని దృఢముగా గ్రహించినతరువాత గోకులదాసు ఒక పెద్ద కళాయిలో నూనె పోసి, బాగుగా కాగబెట్టి, గొల్లవానిని దాని చుట్టు మూడు సారులు ప్రదక్షిణము చేయుమనెనట! గొల్లవాడా సాధువుమాటలు విశ్వసించి ప్రదక్షిణము చేయుచుండగా ఆ సాధువు వానిని పట్టుకొని సలసల కాగుచున్న నూనెలో వానిని పడవేయుటకు ప్రయత్నించెను. గొల్లవాడు సాధువుయొక్క దురుద్యోగమును గ్రహించి కోపోద్రిక్తుడై విదల్చుకొని ఆ సాధువును బలిమిమీద పట్టుకొని నూనెలో పడవేసెను. అంత నాశ్చర్యకరముగ సాధుగోకులదాసు బంగారు విగ్రహమయి కాగులో నిలిచి యుండెనట! గొల్లవాడు భయవిభ్రమ చిత్తుడయి ఆ విగ్రహమును సమీపమందలి బావిలో పడవేసెనట! ఈ బావి గోలకొండ ఖిల్లాలో నున్నది. ఇప్పటికిని గోకులదాసు బావి యను పేరుతో పిలువబడుచున్నది. ఎంతో కాలము క్రింద జరిగిన ఈ బంగారు విగ్రహగాథ కొండయ్య తన దివ్యజ్ఞానము వలననో వంశపరంపరగా చెప్పుకొను కథలవలననో తెలిసికొని యుండెను. కొండయ్య సూచన ప్రకారము అబ్దుల్లాకుతుబుషా ఆ బంగారు విగ్రహమును బావిలోనుండి బయటికితీయించి, తద్ధనమును కోటనిర్మాణమునకు వినియోగించియున్నాడు.

వరంగల్ కోటను, భోనగిరి కోటను కొండయ్యా పూర్వీకులే నిర్మించియుండిరని అబ్దుల్లా కుతుబుషా కొండయ్యాతో చేసికొన్న మనవి మాటలనుబట్టి తెలియుచున్నది. వరంగల్లు విషయమేమోకాని భోనగిరి కోటవిషయములో కూడ ఇట్లే గొల్లవాని సంబంధమున్నట్లు ఒక కథగలదు. ఆ గొల్లవాని పేరు. భోనయ్యా (భువనయ్యా) వాని భార్య పేరు గిరి (గిరమ్మ). ఈ దంపతుల పేర భోనగిరి అని నామకరణము చేయబడినది. అరణ్యములలో సంచరించువారు కాబట్టి చెట్లుపుట్టలయొక్క రహస్యాలు గొల్లవారికి బాగుగ తెలిసియుండెననియు, కోటలను కట్టదలచు రాజులు వారి సహాయమును పొందుచుండిరనియు మనమూహింప వచ్చును.

గొల్లకొండ అనగా గొల్లవాడు చూపినకొండ యని ఇంతవరకు చరిత్రకారులు అర్థము చేసినారు. అటులర్థమైనచో భోనగిరినికూడ గొల్లకొండయని పిలువవలసి వచ్చును. 'ఇదే కొండయ్యా పేరుతోటి' అని సనదులో నున్నందున ఇచ్చట కొండశబ్దము కొండయ్యాకు సంబంధించినదిగా మనము నిశ్చయింప వలెను. ఈ యాదవ పీఠాధిపతులు కొండయ్యాలుగానే కనబడుచున్నారు. తరువాత ఈ వంశమువారికి 'కొండవాళ్లు' అని యింటిపేరేర్పడెను. ఇప్పుడు ముద్దము వాండ్లైనారు. ఈ పేరు మార్పుతో ఈ వంశ ప్రతిభయు నంతరించినది.

సుల్తాన్ కులీకుతుబుషాహా గొల్లకొండ అని పేరు మార్చి యుండుట మనసులో పెట్టుకొని కాబోలు కొండయ్యా "మానుగల్లుకు ఎప్పటికిని గొల్లకొండ అను పేరు వుంచేది"

అని అబ్దుల్లా కుతుబుషాను కోరినాడు. ఆయన సమ్మతించి నాడు. అది యన్నే గోలకొండ నామములో ఇప్పటికిని వ్యవహారము నందున్నది.

అబ్దుల్లా కుతుబుషాహ ధనగరు కొండయ్యా చేసిన మహోపకారమునకు సంతసించి "వీరు లక్ష్మీ సంపన్నులు. కనుక మన కోరికలు యీడేర్చి మనల కృతార్థులచేసినారు. వీరితోనె మనగద్దె నిలచియున్నది" అని కృతజ్ఞతా సూచకముగా పలికియున్నాడు. అంతేగాక, కొండయ్యాను గొల్లల గురువుగా నంగీకరించి, పెక్కు హక్కులను ప్రసాదించి, అతని యధికారము చక్కగా సాగుటకు హుకుం యిచ్చి ఇనాములిచ్చి కొండయ్యాను అతని కోరిక ప్రకారము సంతృప్తి పరచినాడు.

"గోలకొండ గద్దె ఏ బాదుషా ఏలినప్పటికయినా మా సిలసిలా వాండ్లతో ఆశీర్వచనములు సాలుసాలుకు తీసికొనుచుండవలెను. ఏ బాదుషా అయినా తప్పినట్లయితే గద్దెకి హతకు రాగలదు. తురకలేగాని, తెలుగుకాని సాలుసాలుకు ఆశీర్వచనములు తీసుకుంటూ సూర్యచంద్రాదులున్న పర్యంతరం సుఖంగా రాజ్యమేలుచుండవలయును. మా సంతతివాండ్లు కన్నీరు నించితే ఇచ్చటినుంచి లక్ష్మి కన్నీరునించుకొని వెళ్ళిపోవును. గద్దె పరరాజుల పాలు కాగలదు." అని కొండయ్యా మహాత్ముడు నిబంధించినాడు. ఈ విషయములను ఉద్ధరించుచు సుల్తాన్ అబ్దుల్లా

బాదుషా సేనసన్నాహిత ప్రాసించిచ్చిన మొహారు టిప్పణితో సనడు ఫత్వాను ఘనగరు కోం తాన్నీస ప్రసాదించెదమన్నాడు.

తిరిగి ఏమి యుద్ధాచారము జరిగినదో యీవిధ ముగా వ్రా జరిగిన ౩౫ సంవత్సరముల కే కుతుబుషాహి వంశ మంతరించి నది. గోలకొండ రాజ్యము పరరాజుల పాలయినది. ఈ మార్పు ౧౬౮౭లో జరిగినది.

ఇది గోలకొండ నామోదంతము.

౨.

గోలకొండ దుర్గమనగా నొక్క కోటగాదు. మూడు కోటలు. ఈ మూడు కోటలును నొకదానిని చుట్టుకొని మరి యొకటి కట్టబడినది. ఈ కోటను పెంపుచేయుటలో, బల పరచుటలో కుతుబుషాహి సుల్తానులు మిక్కిలిగ పాటుపడిరి. మొదటి నిజాము దీనిని వశపరచుకొనినప్పుడు కోటగోడ వెలుపలి భాగమున తూర్పు దిక్కున నొక గుట్ట యుండెను. శత్రువు దానినాక్రమించినచో వాని నచ్చటినుండి తరలించుట కష్టతరముగా నుండునట్లుండెను. అందుచే నదియును కోటలో జేరి యుండునట్లు దానిని జుట్టుకొనివచ్చు గోడను మొదటి నిజాము నిర్మించెను.

ఈ దుర్గము చుట్టును పెట్టని కోటవలె గుట్టల వరుస గలదు. ఈ గుట్టలమధ్య నాలుగు వందల యడుగుల యెత్తు గల కొండ యొకటి కలదు. ఈ పర్వతో పరిభాగముననే రాజసౌధములుండెను. కుతుబుషాహి వంశ ములో గడపటి

వాడను అబుల్ హసన్ తానీషా రాజ్యము చేయుచున్న కాలమునందు మొగలు చక్రవర్తి యాగు ఔరంగజేబు దీనిని స్వాధీన పరచుకొనుట కెనిమిది నెలలు ముట్టడి చేయవలసి వచ్చెను. దీనిని బట్టి యీ కోటయొక్క బలిష్ఠతయు కోట లోని యేర్పాటులు ఎంతకట్టుదిట్టముగా నుండెనో బోధపడ గలదు.

ఈ దుర్గము యొక్క ఆకారము వంకర టింకరగా నుండును. కోటగోడలయొక్క కైవారము మూడు మైళ్ళ కంటె నెక్కువగానుండును. మూడడుగుల పొడవు నంతియే వెడల్పును గల నల్ల రాతితో గోడలు కట్టబడినవి. దీనికి ౮౭ బురుజులు గలవు. దీనికెనిమిది ద్వారములు గలవు. బంజారా, జమాలి, నయాఖిల్లా యను మూడును వాయవ్య దిశయందు న్నవి, ఫత్తే, మోతీయను రెండును తూర్పు దిశయందున్నవి. బొహ్మ్ని యనునది దక్షిణ దిశయందున్నది. మక్కా, పటంచె రువు అను రెండును పశ్చిమమునందున్నవి. వీనిలో జమాలీ దర్వాజా, ఫత్తే దర్వాజా మక్కా-దర్వాజా బంజారా దర్వాజా యను నాలుగు మాత్రమే వాడుకలో నున్నవి. ఫత్తే దర్వాజానుండియే మొగలులు కోటలో ప్రవేశించి యుండిరి. దీనియొక్క పేరు తలుపు లత్యంత సాంద్రములై యేనుగుల పోటును అడ్డగించుటకు సామర్థ్యముగల పెక్కు యినుప మొనలగుబ్బలతో నొప్పుచున్నది.

పర్వత శిఖరమునయున్న రాజభవనమునకు ‘‘బాలాహిం స్సారు’’ అని పేరు దీనివైపు పోవు విశాలమార్గమున కిరు

వైపుల యుద్ధమునం దుపయోగించిన ఫిరంగి గుండ్లు వందల కొలది కనబడును. ప్రాసాదములు, దేవాలయములు, మసీదులు, మందుకొట్లు, సేనా నివేశములు, అంగళ్ళు అన్నియు శిథిలమయినవి దృగ్గోచరము లగును.

ఫత్తే దర్వాజాకు సుమారు పావు మైలు దూరమున కుడివైపునకు బోవు రాచబాట కలదు. ఈ మార్గములందలి యుద్యానవనములను దాటిపోయినచో "నవమహలు" అను పేరంబరగు కొన్ని మందిరములు కనబడును.

బాలాహిస్సారునకు పోవు దర్వాజాకు కుడివైపున కొంచెము దూరమున జామియుమసీదు కలదు. దీనిని కుతుబుషాహి వంశస్థాపకుడగు సుల్తాను కులీకుతుబుషా కట్టించెను. ఇరువదియైదు సంవత్సరముల తరువాత నీమసీదునందే యువరాజగు "యార్ ఖులీ జాంషీదు ప్రేరణమున గోలకొండఖిలేదారు మీరు మహమ్మదు హమదాని అనువానిచే నితడు వధింపబడెను.

కోటయొక్క యున్నతప్రదేశ మంతయు శిథిలములయిన యాయుధశాలలు, మందుకొట్లు, మసీదులు, రాజవాసములు, విహారములు, జలాశయములు, ధాన్యపుగదులు, సభామందిరములు మొదలగు వానితో నిండియున్నది. బాలాహిస్సారుకు పోవు ద్వారము మీద గరుడపక్షి, సింహము మొదలయిన మృగముల చిత్రములు గలవు. వీనినిబట్టి దీనిని హిందువులు కట్టించి రనునది తెలుచున్నది. ఇట్టి చిత్రములితరభాగములందును గలవు.

ఈదర్వాజా కెడమవైపున మూడంతస్తులమేడ కలదు. ఇది సిలాఖానా యను పేరుగల యాయుధాగారము. ఇందు పూర్వము వాడిన తుపాకులు గలవు. సిలాఖానాకు దక్షిణముగా సుదూరమున తారామతి, భాగమతి యను పేర్లుగల హిందురాణివాస స్త్రీల భవనశిథిలములు గలవు.

కొండపయికి నెక్కుచుండగా నెడమవైపున నొక పెద్ద బావి కలదు. దీనినే గోకులజాసు బావి యనియెదరు. ఆకాలమున నీబావియే పానోదకమును లభింప జేయు చుండెను.

ఇంకను పైకిపోగా అంబరుఖానా కనబడును. ఇది ధనాగారము. ఇచ్చట పారసీభాషలో నొక శాసనముగలదు. దానికి పైగా నొక చిన్న మసీదు, దానికి సమీపమున హిందువుల దేవాలయ మొక గుహలో కలదు. ఈ దేవాలయము నందే మాదన్న మంత్రి దేవపూజ గావించుచుండెనని చెప్పెదరు. ఇచ్చటనే సుప్రసిద్ధభక్తాగ్రగణ్యుడగు భద్రాచల రామదాసును బంధించిన కారాగారమును గలదు.

పర్వత శిఖరమున బాలాహిస్సారు గోడనానుకొని చిన్న గుడి కలదు. ఇప్పటికిని ప్రతివత్సర మాషాఢమాసములో అమ్మవారి జాతర జరుగుచుండును.

బాలాహిస్సారు ప్రాకార ద్వారము దాటగనే యంగణమున్నది. దానికి నెడమ వైపున న్యాయశాల కలదు. పూర్వమిది యెంత యందచందములతో నొప్పుచుండెనో యూహింప

వలసినదే కాని వ్రాయనలవికాదు. ఇప్పుడు బొప్రురు మనుచు నొకే విధముగ సున్నము కొట్టబడి యున్నది. గీని యందొక మూలలో చిన్న ద్వారముకలదు. ఇది యయిదు మయిళ్ళ దూరమునందున్న గోషామహాలునకు బోవు సొరంగ మార్గమని చెప్పెదరు.

దీనికి రెండువైపులను మెట్లుకలవు. వానినెక్కి డాబా మీదికి పోయినచో నచ్చటినుండి చుట్టును ముప్పదిమైళ్ళ దూరమువరకును కంటికి కనబడును. నవాబులు సాయంకాల ములం దిచ్చట కూర్చుండి చల్లని వాయువులను సేవించు చుండి రనియు నచ్చటినుండియే అబుల్ హసన్ తానీషా భయవిభ్రమ చిత్తముతో మొగలుల ముట్టడి ప్రయత్నము లను విలోకించుచుండెననియు తెలియుచున్నది.

పడమటదిశను క్రిందికి దిగగా రాజవంశీయులు, రాజకీ యోద్యోగుల, పరివారపు సదన శిథిలములు కలవు. బంగారా దర్వాజ దాటిన తరువాత గోలకొండ నవాబుల సమాధులు కలవు. ఇవి బ్రహ్మాండాకారపు భవనాళితో, సుందరాలంకార ములతో నొప్పుచు దర్శనీయములయి యున్నవి.

గోలకొండ సుందర ప్రదేశముల శిథిలములివియే. ఒక ప్పుడీ దుర్గము విద్యకు, వినోదమునకు, వర్తకమునకు, వైభవ మునకు, గానమునకు, నృత్యమునకును, ప్రేమవిలాసమునకు, వీర విహారములకు, పెండ్లి పేరంటములకు, రంగురంగుల మేడ లకు, తళుకుబెళుకుగోపురములకు తావలమయి యుండెను. అవి యన్నియు కాలగర్భమున మాటుమణిగి పోయినవి.

పేర నొక తటాకము "ఉదయ సముద్రము" అను పేరుతో నీ గ్రామము చెంత కలదు. ఉదయ సముద్రమునకే ఉదయాదిత్య సముద్రమనియు నామాంతరము కలదు. తటాకముపై నొక శాసన లిఖితము కలదు.

తెలుగు చోడులలో నొక శాఖవారు పదునొకండవ శతాబ్దమునుండి వర్ధమాన పురము, కందూరు, పానగల్లు దుర్గములు మాండలిక రాజులకు నాయాకాలములందు రాజధానులుగా నుండుచు వచ్చెను. ఇంతకు పూర్వము చాళుక్యులు చోడులను జయించినతర్వాత చోడులు కోడూరు రాజధానిగా జేసికొని యుండిరి. అందుచే చోడులు తాము కోడూరుపురవరాధీశ్వరులమని శాసనములలో చెప్పుకొనుట సాంప్రదాయమయ్యెను. తైలపదేవ చక్రవర్తి కల్యాణ పట్టణమును గోల్పోయిన తర్వాత పానుగల్లు దుర్గాధీశ్వరుడయిన ఉదయరాజు స్వతంత్రుడగుటకు ప్రయత్నించెను. (౧౧౫౭)

ఉదయరాజు జైనమతావలంబకుడు. ఇతడు వీరశైవ మతద్వేషియయి, తన్మతానుయాయులను చాల బాధలు పెట్టెను. వీరశైవమత నిర్మూలనోద్యమమున మల్లికార్జున పండితారాధ్యులవారి శిష్యుడును శివభక్తుడును అగు నామయ్య అనువాడు ఉదయరాజు పెట్టు బాధలను సహింపలేక ఉరిపెట్టుకొని చనిపోయెనట! అంత పండితారాధ్యుల వారు రాజును శపించుచు వెడలిపోయెనట! తచ్ఛాప ఫలితముగా పానుగల్లులోని కలుపొన్న (రాతిపొన్న) పూచినదట!

శ్రీ సమస్త మహా మండలేశ్వర కాకతీయ రుద్రదేవ మహారాజులు నిత్యోదితులయి పృథ్వీరాజ్యము చేయుచుండగా, పానుగంటి స్థలమున అధిపతిగా శ్రీమత్ ప్రౌఢ ప్రతాప చక్రవర్తి శ్రీ శార్ఙ్గపాణిదేవమహారాజు ఉన్నట్లు శాసన లిఖితము గలదు. ఇతడు యాదవవంశీయుడగు శూరుడు.

ఆంధ్రదేశములో అబాల గోపాలమునకు పరిచిత మయిన బాలనాగమ్మ కథకు రంగమయినట్టిదీ పానుగల్లే. బాలవర్ధిరాజు వృత్తాంతము, మాయలఫకీరు చర్యలు, నల్లగొండపట్టణ విషయము, మున్నగు కథాంశము లన్నియు ఈ పానుగంటికి సంబంధించినవే.

ఇట్లు వైభవ సంపన్నమై, కళానిలయమయి చెలువొందిన యీ పురవరముయొక్క ఘనతను ఇప్పుడచ్చటి శిథిల చిహ్నములే మనకు మూగభాషలో వ్యక్తపరచుచుండగలవు. వానిని పరికించిన కొలది ఆంధ్రదేశ చరిత్రకు నూతనాధ్యాయములు చేర్పు నవకాశములు గలుగగలవు.

ఈ గ్రామములో నెటుచూచినను రెండు మూడు క్రోసులవరకు శిథిల దేవాలయములు, తటాకములు, అగ్రహారములు గృహచిహ్నములు చూడనగును. లెక్కలేనన్ని బావులు కలవు. ఇంక నెన్నో ఆలయాదులు భూమిలో మునిగిపోయినవి. గ్రామ సమీపమున ఉదయసముద్రమను గొప్ప తటాకము కలదు. ఈ తటాకోదకమున మనము శుచిర్భూతులమయి ముందు దేవతాదర్శనము చేసికొందము.

ఈ దేవాలయము పేరునకొక్కటేగాని ఇది త్రికూటాలయమన నొప్పును. త్రిమూర్తుల కంకితమయిన మూడు దేవాలయములుగా అనుమానించుటకు నవకాశము గలదు. తూర్పు ముఖముగా నున్న యాలయములలోని లింగము నడుములోతు నీళ్లలో నున్నది. ఆలయమున కెదురుగా నున్న కొలనులోని జలమునకును, గర్భాలయమందలి జలమునకును సంబంధము గలదేమో! ఇటనున్న యీ జలము ప్రవహించుచున్నట్టుల తెలిసికొనవచ్చును. కాని ఎటకీజలము చేరుచున్నదో గ్రహింపఁగలేము. ఇదియొక అద్భుతమయిన శిల్పవిషయము.

ఈ మహాశిల్పి చాతుర్యమును గమనింపవలయునన్న మనము గర్భాలయమును బాగుగా పరిశీలించవలయును. శిల్పవిశేషముచే జలమునందున్న లింగము నానుకొని గర్భాలయమున దీర్ఘమగు నల్లని నీడ నొకటి పగలంతయు నొకేచోట కదలక కానవచ్చుచుండును. ఈనీడ సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు ఎంతమాత్రము చలింపక యొకేచోటనే గానుపించుట వింతయైన విషయము గదా! ఈ నీడనుబట్టియే గాబోలు ఈ దేవునికి "ఛాయాసోమేశ్వరుడు" అని పేరువచ్చినది. పాశ్చాత్య శిల్పులు, ప్రకృతిశాస్త్రవేత్తలు చిత్రాతిచిత్రమయిన యీ ఛాయా రహస్యమును తెలిసికొనజాలక యున్నారు. ఆ మహాశిల్పి యొక్క చాతుర్యనైపుణ్యములను ఎంత కొనియాడినను తనివి దీరదుగదా! ఆ మహాశిల్పి యొక్క నామాక్షరములనుగూడ

తెలిసికొను భాగ్యము మనకు లేదు. శ్రీ స్వామి సోమేశ్వర స్వామి పానుగంటి స్థలాధికారుల యిలవేల్పు.

గ్రామమున కానుకొని యొక జీర్ణమైన శివాలయము కలదు. అందలి శిల్ప మత్యద్భుతమయినది. కాకతీయ శిల్పానుసారముగ ఆలయ ద్వారమునం దేనుగులు గలవు. ఆలయములో నాలుగంతర్భాగములు గలవు. లోపలిమండపస్తంభములనిండ శివలీలలు, విష్ణులీలలు, దేవదానవ సంగ్రామములు విరివిగ చిత్రింపబడియున్నవి. ద్వారబంధములపయి చిత్రితమయిన లతావళులు, విగ్రహములు చాళుక్యనాగరికతను, శిల్ప శక్తిని వేయినోళ్ళ శ్లాఘించుచున్నవి. నల్లరాళ్ళపయి చెక్కబడిన యా విగ్రహములు, వీర విహార దృశ్యములు, నందీశ్వరుని సుందర రూపము ఆంధ్ర శిల్పమునకు పరమావధియనుటలో నాశ్చర్యము లేదు.

గ్రామములో నొక విష్ణ్వాలయము గలదు. కాని యది ప్రాచీనమయినట్టిదిగా కనిపించదు. జీర్ణాలయముల శిలలతో విష్ణ్వాలయము నిర్మితమయినట్లు తోచును.

ఎన్నియో శాసన శిలలు గోడలలోపలను, గోరీల వద్దను, భూగర్భమునందును పూడియున్నవి. ప్రత్యేక కృషి చేసి వీటి నన్నింటిని బయలు పరుప వలసియుండును. వాని వలన సమగ్రముగా గాకపోయినను చాలవరకు ఆంధ్రదేశ చరిత్ర విషయములను, ముఖ్యముగా పానుగంటి వరగణా

చరిత్ర విషయములను తెలిసికొనుటకు నవకాశము గలుగ గలదు. అట్టి సదవకాశమునకు వాంఛాభ్యంచిత దృశ్యాలతో మన మెదురుచూచు చుందుముగాక. అంతవరకు గ్రామము చుట్టు దృగ్గోచరములగు జీర్ణమయిన దేవాలయ చిహ్నములు వీర విగ్రహములు, మండపస్తంభములు, కోనేరులు, కోటలు, బురుజులు, శిల్పచిత్రములు మొదలగునవి, మన జాతీయ ధనముగా, మన శిల్పసంపదగా భావించి సంతృప్తి నొందదముగాక!



౫.

# ప్రతిష్ఠానపుర కథనము

## ౧

సుమారు రెండువేలేండ్ల క్రిందటి ముచ్చట.

ఆంధ్రులగు శాతవాహన రాజులకప్పుడు రెండు రాజధానులుండెను. కృష్ణాతీరమందలి ధాన్యకటకము రాజుగారుండు మొదటి రాజధాని. గోదావరీతీరమందలి ప్రతిష్ఠానపురము యువరాజుగారుండు రెండవ రాజధాని. ఈ ప్రతిష్ఠానమును ఇప్పుడు పైఠణ్ అను పేరుతో పిలుచుచున్నారు. ఇది ఔరంగాబాదు జిల్లాలోనున్నది.

ఈ పురము ఎప్పుడు నిర్మాణమయినదో ఎవరు నిర్మించిరో తెలియదు. స్థలపురాణమునుబట్టి బ్రహ్మదేవుడు తనకు నివాసయోగ్యమగు స్థలము కొరకు ప్రపంచము నంతయు పరీక్షించి తుదకు పవిత్రగోదావరీ తీరస్థమగు నీ ప్రదేశమును నిర్ణయించెనట. దీనికి మొట్టమొదట పట్టణమని పేరుపెట్టెనట. కాని తరువాత వెలసిన నగరములు ఎక్కుడు పవిత్రములై బ్రహ్మ        పురమునకు న్యూనతగలుగుట బ్రహ్మదేవుడు సహింపజాలక పోయెను. కావున దానికి

ప్రతిష్ఠానమని నూతన నామకరణము చేసిరి. ప్రతిష్ఠానమనుటచే ఈపట్టణము దేవతల [illegible] భాజనమయినట్లు తెలుచున్నది. ఈ కారణముననే [illegible] పవిత్రత యెక్కువయ్యెను. ఇది తనకు ప్రతిగా నిలిచిన యితరపట్టణములను క్రిందుపరుపగలిగెను! ఇట్టి [illegible] ములతో ఈ పట్టణ జన్మవృత్తాంతమును ప్రతిష్ఠాన మహాత్మ్యము అను స్థలపురాణము వర్ణించుచున్నది. ప్రాచీన పాలీ గ్రంథములలోను ఈ పట్టణ ప్రశంస కలదు. [illegible] ఇది స్థానకమయ్యెను.

ప్రతిష్ఠానము శాతవాహనులకు రాజధానియైనప్పటి నుండి చరిత్ర ప్రసిద్ధమయినది. రాజులు, సామంతులు, సేనలు, ఇచ్చట నివసించుచుండుటచే పురము ప్రాముఖ్యముగా వృద్ధి చెందెను.

ఇది గొప్ప వర్తకస్థానముగా ఉండినట్లు ప్రాచీన చరిత్ర కారుడగు టాలెమీ వ్రాతలవల్ల తెలియుచున్నది. పూసల పరిశ్రమకును, గుడ్డల పరిశ్రమకును ఈ పట్టణము సుప్రసిద్ధ మయినది. నేటికిని ఈ పట్టణము పట్టుబట్టలకును, జరీకిని, జరీపనికిని, కఱ్ఱచెక్కడము పనికిని ప్రసిద్ధము. దివ్య సౌధములు, విపణివీథులు, ఉద్యానవనములు, దేవాలయములు సర్వ సంపల్లక్షణములతో వెలుగొందుచుండెను.

ఇది యూనాడు గొప్ప విద్యాపీఠముగా [illegible] విద్వాంసులగోష్ఠితో ప్రతిధ్వనించుచుండెను. శాతవాహన

రాజు విద్యాప్రియుడై కవుల నభిమానించుటయే గాక కావ్యకర్తయై పేరొందెను. ఈతని యాస్థానములో అమరార్య, బోదేశ, చమిలీద, కుమారభట్టు, ముకుందసేన, శ్రీరాజ, గుణాఢ్య మొదలగు పెక్కురు విద్వాంసులు రాజ సన్మానములు పొందుచుండిరి. గుణాఢ్యుని విషయములో మాత్రము ఒకప్పుడు అపచారము జరిగినట్లు, ఒకవిచిత్రమైన కథగలదు. ఈ గుణాఢ్య పండితుండు పైశాచి భాషలో బృహత్కథను వ్రాసియుండెను. రాజావమానమును సహింపజాలక నారు లక్షల గ్రంథమైన యారుకథలను గుణాఢ్య పండితుడే కాల్చి వేసెను. మిగిలిన లక్షగ్రంథమును ఏడవ కథను శాలివాహనుని ప్రార్థన నంగీకరించి నాశనము చేయలేదు. ఈ బృహత్కథ తెలుగు అనువాదమునకు కథాసరిత్సాగరము అని పేరుగలదు. మనోహరమయిన కథల కాలవాలమయినట్టిదీ గ్రంథము.

విద్యా వాణిజ్య విషయములందే గాక ప్రతిష్ఠానపుర నాగరకతయును తలమానికముగానుండి మిగత ప్రదేశములలోని జనులకు త్రోవ రేఖలను దిద్దుచుండెను. ప్రాచీనకాలమున నాంధ్ర, ద్రవిడ, కర్ణాటక మలయాళ స్త్రీలు రవికలు లేనివారుగా నుండిరి. ఆంధ్ర కర్ణాటాంగనలు ప్రతిష్ఠాన పురమునకు వచ్చిన పిదప నిచటి నివాసులగు ఘూర్జర, మహారాష్ట్ర స్త్రీలను జూచి, క్రొత్తనాగరకత నలవరిచి రవికలను, పయిటలను, ఉంచుకొనసాగిరి. ప్రతిష్ఠానము పైఠణ్ అయినది, పయిట పైటలను పదములు పైఠణ్ పదమునుండి పుట్టినవే.

గీయులు రాష్ట్రఖ్యాతి గాంచిరి. మహమ్మదీయుల సైన్యమప్పుడు ప్రతిష్ఠానపురమునందే విడిసియుండెను. పదునాల్గవ శతాబ్దములో నీపురము అహమదునగరు నిజాంషాహీల వశమయినది. దీనికప్పటి పేరు మంగిపైఠణ. తరువాత నిది విజాపుర రాజుల వశమయ్యెను. క్రీస్తుశకము ౧౫౯౯ లో నక్బరు కుమారుడగు దానియాల్ రాకుమారునకును విజాపుర రాజకుమారితకును పైఠను నందే వివాహము జరిగెను. తరువాత కొంతకాలము దీనిచరిత్ర ఏమియు తెలియరాదు. ౧౭౨౦లో హైదరాబాదు నిజాం ప్రభువు పాలనలోనికి వచ్చెను. పదునెనిమిదవ శతాబ్దాంతమునందు మహదాజీ సింధియాకును రాజపుత్ర సైన్యములకును పైఠను నందే ఘోరయుద్ధము జరిగెను. మహారాష్ట్రులు గెలిచిరి.

ఇన్ని రాజవంశములతో సంబంధము కలిగిన యీ పట్టణ మెట్లు పాడుపడి పల్లెటూరయినదో తెలియుటలేదు. ఇతర పట్టణముల యౌన్నత్యమును జూచి సహింపలేక దీనిని మేలిబంతిగా చేయుకొనదలఁచిన బ్రహ్మదేవుడు తన ప్రియమైన పట్టణము వినాశదేవత పాలయినందులకు ఎట్టులోర్చెనో గదా! ఈ పట్టణముపై మోజు ఆ దేవునకు క్రమముగా తగ్గిపోయినది కాబోలు! లేక ఇంకొక పురమును కట్టుకొన్నాడో.

ప్రతిష్ఠానములో నన్ని కులాలవా రుండిరనవచ్చును. శాలివాహనుఁడను రాజు బ్రాహ్మణ పురుషునకును కుమ్మరి వనితకును జనించిన వాడని ఒక ఐతిహ్యముకలదు. ఇది నిజమయినను, కాకపోయినను తత్కాలమున ఉత్తమ సంతా

సాగనము అసవర్ణ వివాహములు జరుగుచుండవచ్చును. తరువాత చాల కాలమునకు బయలుదేరిన మహానుభావ సాంప్రదాయము ఈ అభిప్రాయమునకు దోహద మిచ్చు చున్నది.

ఈ సాంప్రదాయపు మతకర్త కృష్ణభట్టను బ్రాహ్మణుడు. కృష్ణభట్టు ప్రతిష్ఠానపుర కాపురస్థుడు. రాజుగారికి పరతత్త్వ బోధకుడు. ఇతడు పెక్కు దేవతారాధనలను ఖండించెను. వేదనోదిత మయిన ఏకేశ్వరోపాసనమును పునః స్థాపించుటకు ప్రయత్నించెను. శ్రీకృష్ణపరమాత్మ యొక్కడే ఉపాస్యదైవమని ఉద్ఘాటించెను. కులమత సంబంధమైన కట్టుబాట్లను త్రెంచివైచి సర్వసంగపరిత్యాగులై భైక్షుక వృత్తితో జీవించునట్లు శిష్యవర్గమునకు బోధించెను

కృష్ణభట్టు ఒక మాతంగ కన్యను పెండ్లియాడెను. ఇట్టి విపరీతాచరణమునకు బ్రాహ్మణబృందము కినిసి యాతనిని వెలివేసిరి. నగరమునుండి వెడలనడచిరి. కృష్ణభట్టు జంకుకొంకులు లేనివాడును, బుద్ధి బలము గలవాడును నగుటచే స్థైర్యము వీడక యామాతంగ స్త్రీతోనే కాపురము చేయ సాగెను. ఈ దంపతుల కయిదుగురు కొడుకులు కలిగిరి. మహానుభావ సాంప్రదాయములో మొదలు చేరినవారు ఈతని అయిదుగురు కుమారులే. ఈ పుత్రులు తండ్రి యాజ్ఞానుసారము దేశాటనము చేయుచు నూతన సాంప్రదాయమును బోధించి యెంతో మందిని ఈ మతమునందు చేర్చిరి.

ఈ సాంప్రదాయమునందు గురుస్థానమందుండువారు ముండిత శిరస్కులయి దండకమండలములను బూని, నీలవర్ణ వస్త్రములను ధరించవలెను. శాకమే వారి భోజనపదార్థము, ఉదకమే వారి పానీయము. ఈ సాంప్రదాయకులు దక్కను సంస్థానము బెరారునందును ఎక్కువగా నున్నారు. వీరి జాతరలు పెక్కుచోట్ల జరుగుచుండును. వీటికి వేలకొలది కృష్ణభక్తులు మతానుయాయులు గుమిగూడుచుందురు. ఈ విధముగా ప్రతిష్ఠానము ఒక మత సాంప్రదాయమునకు జన్మస్థాన మయ్యెను.

౨.

“౧౯౩౭ లో ప్రతిష్ఠాన పట్టణమున గోదావరి ఉత్తర తీరమున నాల్గు స్థలములలో త్రవ్వకము ప్రారంభమాయెను. ప్రాయోగికముగా ఒకచోట త్రవ్వి, అదే చోటిని విశాలపరచిరి. ఇట్లు త్రవ్వగా ఒక్కొక్క పొరలో లభించిన వస్తువులు వివిధయుగములకు చెందినట్లు గోచరించెను.

నాల్గు స్థలములలోను రెండు స్థలములలో త్రవ్వితీసిన వస్తువులు మిక్కిలి సంతృప్తికరముగ నున్నవి. ౧౮ అడుగుల లోతువరకు ఇక్కడ త్రవ్విరి. కొన్నిచోట్ల ఒకదానిక్రింద నొకటి ౭ పొరలు—౭ యుగముల నాగరికతను సూచించునవి—కన్పించెను. పై పొరలోకల భవనములు రాయి సున్నముతోను, ఇటుక — అడుసుతోను కట్టినవి. ఇవి భూమి మట్టమునకు ౮ అడుగుల లోతులో కన్పించినవి. ఇందులో

బ్రిటీషువారి కాలపు నాణెములు, పలురకముల పూసలు, కాసాపా త్రలు, మట్టిపాత్రలు లభించినవి. ఇవన్నియు ఇటీవలివి. దానిక్రింది పొర ౧౦౦-౧౫౦ సంవత్సరములకు చెందినది. ఇందులో ప్రథమ ఆసఫ్జాహి నాణెములు లభించినవి. మూడవ పొరలో మొగలు చక్రవర్తుల కాలమునాటి వెండి రాగి నాణెములు దొరికినవి. నాల్గవ పొరలోని గాజులు, పూసలు ఐదవ పొరయందలి గాజులతోను పూసలతోను కలిసిపోయి యున్నవి. అంతేకాక దొరికిన వస్తువులు పటువాలుగను, కదలి పోయినవిగను ఉన్నవి. గాజులు కరిగిపోయిన చిహ్నములు కలవు. అందుచే ఒకప్పుడు గొప్ప మంటచే ఇండ్లన్నియు పడి పోయి పట్టణము ధ్వంసమై యుండవచ్చునని చెప్పవచ్చును. ఈ పట్టణములో బహామనీ నాణెములు, తుగ్లక్ నాణెములు కూడ లభించినవి. అందుచే ఈనగరము ౧౪ వ శతాబ్దమున కాని ౧౫ వ శతాబ్దపు ప్రారంభమున కాని సంభవించి యుండునని ఊహించవచ్చును.

౫ వ పొరవద్దకు వచ్చుటకు ౮ అడుగులు త్రవ్వవలసి వచ్చెను. నాల్గవపొర, ఐదవపొర పరీక్షించి ఇంకను లోతుకు త్రవ్విరి. మరి ౫ అడుగులు త్రవ్విన తర్వాతగాని ఎట్టి కట్టడముయొక్క చిహ్నములును లభించలేదు. మొట్టమొదట ఈపని వ్యర్థమనిపించెను. కాని మధ్యమధ్య లభించిన ప్రాచీనాంధ్ర నాణెములు ప్రోత్సాహమును గల్గించెను. లోపల స్తూపాకార తప్పక కలదను నమ్మకమును ధ్రువపరచెను.

తుట్టతుదకు ౧౬ అడుగుల లోతులో ఇసుకపొర ఒండుమట్టి పొర క్రింద ౬ వ పొర లభించెను.

<u>వాస్తుశిల్పము.</u> ఆరవపొరయందు ౨ అడుగుల సందుచే వేరుచేయబడిన రెండు భవనముల పయిన కన్పించును. కాల్చిన ఇటుకతో ఇవి కట్టబడినవి. ఇటుకలు మిక్కిలి పెద్దవి. ౧౨ మొదలు ౧౬ అంగుళముల పొడవు కలవి. సున్నము ఈ భవనములలో ఎక్కడను కన్పించలేదు. అడుసు ఉపయోగింపబడినదని స్పష్టముగు చున్నది. అందుచే సున్నము వాడుక లోనికి రాకపూర్వపు భవనము లివని స్పష్టమగుచున్నది. 3॥ అడుగుల యెత్తుగల గోడలు ఇంకను ఉన్నవి.

<u>మురికినీటి కాల్వలు.</u> అదేపొరలో, భవనముల క్రింద, వాటికి ౨౦౦ గజముల మేరలో దక్షిణమున ఇటుకలతో కట్టిన మురికినీటి కాల్వలు కన్పించెను. ఈకాలువ ౨౦॥'' +౮''+3॥'' కొలతలుకల మిక్కిలి పెద్ద ఇటుకలతో కట్టబడినది. ఇందులో ఎక్కడను సున్నములేదు. ఈ కాలువప్రక్కనే 3 గొట్టములువంటి ఇటుక కట్టడములు ౮॥ అడుగులు వ్యాసము కలవి ఉన్నవి. కాని కాలువతో వాటికి సంబంధము లేదు. ఒక సారి ఈ కాలువలు మంచినీటి కాలువలు కావచ్చునని అనుమానించ వచ్చును. గుండ్రటి స్తంభాకారము కల ఈ కట్టడములు ఒక విధమైన 'మాదువులు' కావచ్చును. ఇవన్నియు మిక్కిలి ప్రాచీనమైనవని అందే లభించిన ఇతరవస్తువులను బట్టి చెప్ప వచ్చును.

ఇతర వస్తువులు. ఆవవేసిన మట్టి, ముత్యపుచిప్పలు, ఏనుగు దంతపు వస్తువులు, రాతి వస్తువులు, ఇనుప వస్తువులు, రాగి, ఇత్తడి, కంచు వస్తువులు, వెండి, బంగారము, గాజు, పోతపైనా మున్నగు పెక్కు వస్తువు లిందు లభించెను.

మట్టివస్తువులు. ప్రాచీనతనుబట్టి పూసలు, మట్టిబొమ్మలను గూర్చి ముందు చెప్పవలెను. మట్టిపూసలు ఎక్కువగా దొరకినవి. అవి వివిధ రూపములతో నున్నవి—కొన్ని గుండ్రముగను, కొన్ని పొడవుగను, కొన్ని చతురముగను ఉన్నవి. ఇవి మిక్కిలి ప్రాచీనమైన వనుటకు సాక్ష్యము మట్టిబొమ్మల్ల మెడలలో హారములుగా మస్కీయందును మొహంజోదారో యందును దొరకుట.

తర్వాత మట్టి బొమ్మలు. ఇవి పురుషులవి, స్త్రీలవి కూడ నున్నవి. వీటి పనితనము మొరటుగా నున్నది. బొమ్మల వక్షోభాగము నగ్నముగ నున్నది. మెడలు, తలలు పూసలచే అలంకరింపబడి యున్నవి. ఈబొమ్మల పనితనము మొహంజోదారో, చన్హోదారో, మస్కీ మున్నగు ప్రాంతములలో లభించిన బొమ్మల పనితనమును పోలియున్నది.

3/8" వ్యాసముగల మట్టిచక్ర మొకటి ఇక్కడ లభించినది. ఒకవైపు రెండు మానవ విగ్రహము లున్నవి. కుడి వైపుననున్న బొమ్మ కాలు సేతులతో సంపూర్ణముగ నున్నది. కాని రెండవది – బహుశః స్త్రీ విగ్రహము

కావచ్చును—చేతులు లేనిది. ప్రాచీన చిత్రకళకిది ఒక ఉదాహరణము.

మధ్యరంధ్రముకల చిన్నమట్టి చక్రములు పెక్కు లభించినవి. ఇవి చక్రములవలె కన్పించుచున్నవి. బంగారము కరిగించు మట్టి మూసలును, రంగుకుండలును కూడ లభించినవి.

ముత్యపు చిప్పలు—పగడాలు. ముత్యపుచిప్పలు, పగడాలు కూడ లభించినవి. ప్రాచీన ప్రతిష్ఠానపురములో ఈ పరిశ్రమ ప్రసిద్ధికెక్కి యుండెను. గాజులు, ఉంగరములు, పూసలు, ఇతర అలంకార వస్తువులును దొరకినవి.

ఏనుగు దంతపు వస్తువులు. దీనితర్వాత ఏనుగు దంతముతో చేసిన వస్తువులెన్నదగినవి. ఇవి అనేక రకములైనవి కలవు. ఇందు మంచి పనితనము కన్పించుచున్నది. దంతపు గాజులు, చదరంగ పాళీలు. పాచికలు, కర్ణాలంకారములు సూదులు, కదుళ్ళు మున్నగు వస్తువులు లభించినవి.

రాతివస్తువులు. రాతియుగమునకు సంబంధించినవస్తువులేవియు ఇంతవరకు ఇక్కడ లభించక పోయినను వివిధములగు రాళ్ళతో చేయబడిన పూసలు ఇక్కడసంస్కృతియొక్క ప్రాచీనతను తెల్పుచున్నవి. నల్లరాయి, రక్తమణి, వైడూర్యము, స్ఫటికశిల, శ్వేతరక్తశిల మున్నగు అనేక విధముల రాళ్లు పూసల పరిశ్రమలో వాడినట్లు స్పష్టమగుచున్నది. ఈ పూసలు కొన్ని గుండ్రముగను, కొన్ని బల్లపరుపుగను,

కొన్ని వర్తుల స్తంభాకారముగను ఉన్నవి. కొన్ని పలకలు పలకలుగా ఉన్నవి.

పైన పేర్కొనబడిన విధముల ప్రూసలు పురాతత్వ్వ శాస్త్రదృష్టిలో చాల ముఖ్యమైనవి. ప్రథమముగ ఇవి దక్షిణ నాగరికతకును, సింధులోయ నాగరికతకును సంబంధ ము ను స్థాపించుచున్నవి, రెండవది ప్రాచీన గ్రీకు, రోమన్, ఈజిప్షన్ గ్రంథకర్తలచే ప్రశంసింపబడిన పై తాను ప్రూసల పరిశ్రమను గూర్చిన వ్రాతలు ధ్రువపరచు చున్నవి.

ఆంధ్రనాణెములు. ఇక్కడలభించిన శాస్త్రవస్తువులలో ముఖ్యమైనవి ౬ వ పొరలో లభించిన ఆంధ్రుల రాగి నాణె ములు, పది చదరపు రాగి నాణెములు ఒకచోట దొరకినవి. వీటిపై ఒకవైపున బోధివృక్ష మచ్చొత్తబడి యున్నది. వెనుక వర్ణింపబడిన కాలువలో ఇవి లభించినవి. అదే విధముగ అనేక నాణెములు అదేపొరలో లభించినవి. కొన్ని నాణెములపై స్వస్తికచిహ్నము కలదు. వాటి ఆకారము 'క్రాసు' దరిదాపుననున్నది. తక్షశిలలో లభించిన ఆంధ్రనాణెముల నివి పోలియున్నవి. సీసపు నాణె ములు కూడ దొరకినవి. ఇవి ఆంధ్రుల వనుట నిస్సందేహము. ఇట్టివి ఇంకను పెక్కితర స్థలములందు లభించెను. ఇవి యాంధ్ర నాణెములేనని పరిశోధకుల అభిప్రాయము. ఇవికాక కొన్ని చిన్న గుండ్రని చిల్లికల నాణెములును లభించినవి. ఈ నాణెము లీ స్థలము యొక్క ప్రాచీనతను మరి మూడు నాల్గు శతాబ్దములు వెనుకకు నెట్టినవి.

ఇటీవలి వస్తువులు. ఇవికాక పదునాల్గవ శతాబ్దపు తుగ్లక్, బహమనీ రాజవంశముల యొక్కయు, పదునారు మొదలు పదునెనిమిదవ శతాబ్దము వరకు పాలించిన మొగల్ చక్రవర్తుల యొక్కయు, ఆదిల్ షాహి, నిజామ్‌షాహి, బరీద్ షాహి రాజవంశముల యొక్కయు, ఆసఫ్‌జాహీ రాజ వంశముయొక్కయు నాణెములు లభించినవి. ఇవికాక అనేక ఆయుధములు, చైనాపాత్రలు, రాగికంచుపాత్రలు, బంగారు వెండినగలు లభించినవి.''♦



♦ హైదరాబాదు సమాచారము. సెప్టెంబరు ౧౯౪౮.

౯.

# భోనగిరి కథనము

భోనగిరి పట్టణ మొకప్పుడు ఆంధ్ర రాజధానిగా నుండెను. ఇప్పుడది శిథిలచిహ్నములతో గూడిన చిన్న బస్తి. ఈ బస్తీకి మయిలుదూరములో ఒక పర్వత మున్నది. ఆ పర్వతముపై దుర్గము కట్టబడినది. ఆదుర్గము పేరే భోనగిరి. ఆ పేరే పర్వతసమీపమున నిర్మాణమయిన నగరమునకును పెట్టబడినది. ఈ పర్వతము విశాలమయిన మైదానములో నున్నది. అది పల్లపు ప్రదేశము కాబట్టి దూరమునుండి చూచినప్పటికంటె దగ్గర దగ్గరగా పోయి చూచినప్పుడు రెండింతలు ఎత్తు కనబడును. దక్షిణమునను. తూర్పునను కోట గోడ మొదలుకొని పర్వత పాదమువరకును ఏకశిలా ఖండమే ప్రాకార కుడ్యముగా నుపకరించుచు, శత్రువుల కగమ్యమై యున్నది. ఉత్తరమునను. పశ్చిమమునను రాతి కట్టడపు బలిష్ఠ ప్రాకారకుడ్యము లున్నవి.

ఈ గిరిదుర్గము యొక్క కలిమిలో, బలిమిలో సరి తూగ గలుగునది ఒక ఓరుగల్లు కోట మాత్రమే. ఖమ్మము మెట్టు, కొండపల్లి, దేవరకొండ, జఫర్‌గడ, నల్లగొండ మొదలగు కోటలు భోనగిరి కోట ముందర అల్పమైనవే.

ఈ గిరిదుర్గము ఎప్పుడు నిర్మితమైనదో సరియైన చరిత్రాంశములు లేవు. నిర్మాణము 3000 ల సంవత్సరముల క్రిందట అయియుండవచ్చునని ఒక ఉర్దూ వార్తాపత్రికలో లిఖితము కలదు గాని అది అంత నమ్మదగిన విషయము కాదు. మనము సరిగా చెప్పలేకపోయినను ఇది అత్యంత పురాతనమైనదని మాత్రము మనము నిశ్చయించవచ్చును.

ఈ గిరిదుర్గమునకు భోనగిరి అను నామకరణమెట్లు చేయబడినదో తెలుపునట్టిగాథ యొకటికలదు. ఈ కథలో వాస్తవమున్నట్లును తెలియుచున్నది. అత్యంత పురాతన కాలములో ఈ ప్రాంతపు హిందూరాజొకడు భోనగిరి కీశాన్యమున నున్న రాయగిరి గుట్టలమీద కోటకట్టుటకు ప్రారంభించెను. ఈ గుర్తులు ఇప్పటికిని ఆ గుట్టలపయి కనబడును. కోట నిర్మాణము సాగుచుండగా ఆ గుట్టలలో మేకలను మేపుకొనుచున్న ఒక గొల్లవాడు ఆ హడావిడియంతయు గమనించెను. ఆ గొల్లవాని పేరు భోన (భోనయ్య). ఆ గొల్ల బోయడు అచ్చట పర్యవేక్షణము సలుపుచున్న ఉద్యోగులను సమీపించి, "అయ్యా! ఏమిటీ హడావిడీ అంత! ఇచ్చట ఏమి కడుతున్నారు?" అని ప్రశ్నించెను. "మారాజు గారి యాజ్ఞ ప్రకారము ఇచ్చట కోట కడుతున్నాము" అని వారు ప్రత్యుత్తరమిచ్చిరి. గొల్ల బోయడు పకపకనవ్వి "మీ రాజుగారికి కోటల నెచ్చట గట్టవలెనో ఏమాత్రము తెలియ నట్లున్నది." అని నిర్భయముగా పలికెను. అంతటిలో నూరు

కొనక "మీరాజుగారికి జ్ఞానమే యున్నయెడల ఇట్టి నికి మాలిన గుట్టలను పసందు చేసియుండడు. ఎదురుగానున్న గుట్టలపయి శత్రురాజు దండువిడిసి, మీ కోటపయి దాడి సలిపినచో మీకోటపస యెట్లుండునో యోచించినారా!" ఇట్లు పలుకుచు భోనబోయడు తన విజ్ఞానమును ప్రకటించెను.

ఆ గొల్లవాని వాక్యము లాయుద్యోగులను చకితులను గావించెను. అంత వారు ఆ గొల్లవాని కథా విధానమును రాజుగారికి నివేదించిరి. రాజుగారు వెంటనే గొల్లవానిని పిలిపించుకొని "బోయడా! మా ఆలోచనమును ఆక్షేపించి నావు. బాగానేయున్నది. నీవు తెలిసిన వాడవుగా కనబడు చున్నావు. మరి కోట నెక్కడ కట్టుమందువో చెప్పుము. నీవు చెప్పిన ప్రకారముచేసి నిన్ను గౌరవిస్తాము" అని రాజుగారు అనునయముగా పలికిరి.

"రాజుగారు నాకు రెండువరములు దయచేసి, నాసల హానను సరించి పని జ:పినచో, సాటిలేని గుట్టను చూపించ గలను. దానిని శత్రువు సాధించుట దుష్కరము" అనిగొల్ల భోనడనెను. రాజుగారు వాని రెండు కోరికలను తీర్చెదనని వాగ్దానము చేసెను. గొల్లవాని రెండు కోరికలలో, ఒకటి పర్వతముపయి కోట గట్టుటయేగాక గుట్ట దిగువను ఒక నగరముకూడ నిర్మించవలెను. వాని పేరు భోన, వాని భార్య పేరు గిరి. కాబట్టి ఆ యిద్దరిపేర్లు ఉండునట్లుగా, కోట కును. నగరమునకును "భోనగిరి" అని నామ కరణము

చేయవలెను. రెండవది, భోనగిరి నగరములో వాని పేర నొక గుడి కట్టించవలయును. ఈ రెండు విషయములకు రాజు సమ్మతించెను.

భోనగిరి నామము పొందిన ఆపర్వతము ఆకాలములో తరుగుల్మలతాదుల నిండి యుండుటచే గిరిస్వరూపము కనబడకుండెనట! దానిపయి ప్రాకిన ఒకానొక తీగ పర్వత శిరమునుండి పర్వత పాదమువరకు అంతటను దట్టముగ వ్యాపించి యుండెను. ఆతీగయొక్క తల్లివేరు ఎచ్చట నున్నదో భోన బోయనికి తెలిసియుండెను. ఆ గుట్టకు పడమరగా ౮,౨ మయిళ్ళదూరమున హనుమాపురములో తల్లివేరుండెనట. కాబట్టి భోను డా చెట్టు వేరును కొట్టివేసెను. తత్ఫలితముగా గుట్ట నావరించియున్న తీగయంతయు రెండు రోజులలో ఎండిపోయెను. మూడవరోజు ఉదయమున వాడా యెండిన తీగనంతను తగులబెట్టెను. అంత గుట్టమీది చెట్లు చేమ లన్నియు భస్మముకాగా గుట్ట ఒక అండాకారమున బయటపడెను. అప్పుడు గొల్లవాడు రాజుగారిని పిలుచుకొని వచ్చి గుట్టను చూపెను. రాజుగారా పర్వతపు మేలిపరిస్థితి, ఔన్నత్యము, అందచందములు జలసౌకర్యములు తిలకించి అత్యంత ముదితుడయ్యెను. వెంటనే దానిమీద స్థలానవరణము గావించి, కోటకట్టించెను. నగరమునుగూడ నిర్మాణము గావించెను. పూర్వోక్త వాగ్దానాను సారము గొల్లదంపతులగు భోనయ్య గిరెమ్మల పేరుతో "భోనగిరి" అని నామకరణము చేసెను. గ్రామమున కాగ్నేయమూలమున భోనయ్య గిరె

౧౫౦౦౦ల సైన్యముతో వేల్పుగొండను సమీపింప
సాగెను.

ధంసా యనుమతి లేనిదే పరులు కోటలో ప్రవేశించు
టకు వీలులేదు కావున నల్గురు దేశముఖులు తమ కుమారుల
కేశఖండనోత్సవము జరుపుకొను నెపముతో శ్రీయోగా
నంద నరసింహస్వామివారి సన్నిధికి వచ్చునట్లు జగ్గపంతులు
ఉపాయము చెప్పెను. ఆ నలుగురు దేశముఖులు కుమారుల
కేశఖండనోత్సవమని కృత్రిమపు వృత్తాంతమున, మేన, సవారి,
పల్లకీలు, తూర్యనాదములతో, మద్దళ వేశ్యానటన గాయక
వైభవముల కోటద్వారమునకే తెంచిరి. ఈ దేశముఖుల వెంట
౨౦౦ మంది యుద్ధవీరులు పరిచారకులుగా మారువేషముతో
వచ్చిరి. ద్వారమున తాలారించుచున్న జగన్నాథహజారి
అను వాడు దేశముఖులకు ప్రవేశము నియ్యక ఆపివేసెను.
"మేము దేవసాన్నిధ్యమునకే తెంచినారము. మా శుభ
కార్యమునకు విఘ్నములు చేయవలదు" అని దేశముఖులు
వేడుకొనిరి జగ్గుపంతులు ఈ విషయము నెరుగని వానివలె
నటించి, సందడి యేమియని జగన్నాథహజారి నడిగి తెలి
సికొని "వీరు శత్రువులుగా కనబడరు, యుద్ధ సామగ్రి
యేమియులేదు. వారు మొక్కులు చెల్లించుకొని పోయెదరు.
అందువల్ల మనకేమి నష్టము?" అని ఏమేమొ జగన్నాథ
హజారికి చెప్పి వారలు కోటలో ప్రవేశించునట్లు చేసెను.

ఇట్లు దేశముఖులు అనుచర సమూహముతో కోటలో
ప్రవేశించి, శిశువులకు కృత్రిమముగా నేర్పరచిన జడలను

జఫరుద్దౌలాచే నిర్మితమయిన భాగములను గలుపుకొని వేల్పుగొండ కోటకు జఫరుగడమను నామము వచ్చినది. జఫరుగడమున తూర్పున నొక కొండయు, పశ్చిమమున నొక కొండయు గలవు. ఈ రెండు కొండలమధ్యమున చుట్టు ౯ గజముల ఎత్తు, ౨ గజముల వెడల్పు శిలలచే గారచేయు బడినది. పశ్చిమ పర్వతముమీాదికి భూమినుండి నర మృగాదులు పోవు మార్గములు ప్రత్యేకముగా గలవు. అందు రహస్య మార్గము లనేకములు ౨౪ గజముల వెడల్పు గలిగి యుండెను. అవి నేల బొయ్యారములు. కోటలో ఫిరంగులు, తుపాకులు, మందుగుండు సామగ్రి, సైన్యములు నిండియుండెను. జఫరుగడ్ షహరు అని ప్రసిద్ధిచెందిన యీ నగరమునకు మూడు ద్వారములు కలవు. తూర్పు పర్వతమునకు దక్షిణభాగమున నొక ద్వారమును, పశ్చిమ పర్వతమునకుత్తరముననుదక్షిణముననురెండు ద్వారములును గలవు దీని చుట్టునున్న కందకము ౧౨ గజముల లోతు, ౧౨ గజముల వెడల్పు గలిగియుండెను. ౧౬ బురుజులు, ౧౦ మందుల కొట్లు ఉండెను.తూర్పున నొక పిల్ల ద్వార ముండెను. దీనిని భజంత్రిద్వార మనుచుండిరి. పశ్చిమపర్వతముమీాద రెండు జలాశయములును, రెండు చక్కని బావులును గలవు. తూర్పుకొండపయి ఒక జలాశయము గలదు. వీటియందలి నీరు పానయోగ్యమగు స్వచ్ఛజలము. జఫరుగడమును సర్వ సౌకర్య సంపన్నముగను, దృఢముగను చేయుటకు జఫరుద్దౌలాకు ౧౪ సంవత్సరములు పట్టినదట.!

జఫరుద్దౌలాకు తులసి, మణి అను యిద్దరు వేశ్యాంగనలు ప్రియురాండ్రుండిరని చెప్పితిమిగదా! వీరిద్దరు శివకేశవుల యెడ భక్తి తాత్పర్యములు గలవారయి, పరోపకార పారీణలయి యుండిరి. జఫరుద్దౌలా వీరికి వశంవదుడయి యున్నందున అచ్చటి యోగానంద నరసింహస్వామి వారికి అర్చనాదులు చక్కగా జరుగునట్లు ఏర్పాట్లు చేయించిరి. వీరిద్దరి పేరిట రెండు శిలామయ కూపములు నిర్మింపబడినవి. పశ్చిమ పర్వతమున కుత్తరభాగమున మణెమ్మబావి, దక్షిణ భాగమున తులశమ్మ బావి గలదు. పర్వతమునకు ఉత్తరభాగమున మూడుమయిళ్ల దూరమున ధంసా నిర్మించిన చెరువు గలదు. ఇది తాడిచెట్టెత్తు కట్టగలిగి, వెనుకముందు రాతి కట్టడముతో శాశ్వత బ్రహ్మకల్పముగానున్నది. వేల్పుగొండ ముట్టడి సమయమున ధంసా యిచ్చటనే విడిసి యుండెను.

ఇప్పుడు దుర్గము మంచి స్థితిలోలేదు. దుర్గపు సింహద్వారములకు తాళములు వేసియుండునట! ఆ తాళము చెవులు ఒక యధికారి యొద్ద నుండునట!